# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-7-1981 సంచిక 18


## —* ఈ సంచికలో *—



1—8—81 సంచికలో ముక్తలక్షణ కౌముది, ధర్మన భావనాశక్తి, ప్రబంధ రత్నావళి - పరిశీలనము, జాషువా వర్ణించిన మన పండుగలు మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

## పారిజాతాపహరణం - ప్రబంధపారిజాతం

- శ్రీ మామిడేల హరినారాయణశర్మ, ఎం. ఏ.

అపరకృష్ణావతారుడైన శ్రీకృష్ణదేవ రాయల ఆస్థాన మండలి అష్టదిగ్గజాలలో పెద్దన తర్వాత పేరొందిన కవిచంద్రుడు తిమ్మనామాత్యుడు. ముద్దు పలుకులను చిల్కరించే ముక్కు తిమ్మన మైమరపించే వర్ణనలతో రచించిన రసవత్ప్రబంధం పారిజాతాపహరణం. శైలియందు, భావమునందు, కథాసంవిధానమందు అంతగా లాలిత్యాన్ని ప్రదర్శించిన లలితకవి వేరొకడు లేడనుట సత్యదూరం కాదు.

కావ్యరచనకు రాయల అంతఃపురవృత్తాంత మొకటి హేతు వని కొందరి తలంపు. ఒక వెన్నెలరేయి ప్రమోదవనాన రాణి శయ్యపై రమణీలోలుడై యున్న రాయలను, రాణి తన పాదంతో ప్రక్కకు నెట్టిందట. తత్కారణమున నిరాదరుడైన రాజు ఆమె కడకేగుట మానుకొన్నాడు. సరసుడైన తిమ్మన రాజును రాణి సమీపానికి చేర్చడానికి సత్యభామ వామపాదంతో కృష్ణుని శిరమును తొలగద్రోసిన గాథను గ్రహించి సుకుమార మనోహర వర్ణనల్ని చొప్పించి 'పారిజాతాపహరణ' మను ప్రబంధాన్ని రచించి వసంతోత్సవ సభలో వినిపించాడు. తన దోసంగు నెరిగిన రాజు అంతఃపురానికి చేరి రాణిని బుజ్జగించా డట. కాని రసికచక్రవర్తియగు రాయలు కాంతాకలహాలను సవరించుకోలేని నీరసుడు కాదు కదా! ఇందు సత్యాసత్యము లెట్లున్నను ప్రబంధోద్యాన వనంలో ప్రబంధ పారిజాతాన్ని ప్రతిష్ఠించడానికి తగిన కథగా రక్తి కట్టినది.

ప్రబంధ మనునది ఒక రచనావిశేషం. ప్రకృష్టబంధము గలది. అదే బిగువైన కూర్పు. ప్రబంధ శబ్దాన్ని పలువురు లాక్షణికులు తమ గ్రంథాలలో వాడినారు. పాణిని అష్టాధ్యాయి లో ప్రబంధాకథా తేషాం రచనేన గ్రథనేన అన్నాడు. అంటే కథారచనయే ప్రబంధం 'ప్రబధ్యతే ఇతి ప్రబంధః' అని వాచస్పత్యం. అంటే రచనా విశేషం. ఇందుకథైక్యం కనబడవలె, కథ లెన్ని ఉన్నను వానికి ఒక తత్త్వం ప్రధాన సూత్రం.

ప్రబంధ కథా వైచిత్రి :-

సత్యభామ అహంకారాన్ని, ఈర్ష్యాద్వేషాది మాలిన్యాన్ని పోగొట్టి, ఆమె ప్రేమను నిష్కళంక మొనరించు తలంపుతో దేవర్షి ఒక పారిజాత ప్రసూనాన్ని కృష్ణుని కివ్వగా 'కన్నుగవన్ చిన్నవవ్వు దొలక న్మౌని నాథుని కను సన్న'తో రుక్మిణీకాంత కిచ్చాడు. రుక్మిణి కృతజ్ఞత గా మునికి నమస్కరించి ధరించినది. అపుడామె శీత నెల ధరించిన పార్వతి వలె నుండట. ముందే రవరవలతో నుండు రుక్మిణీ - సత్యభామల మధ్య కలహాశనుడీ కలహబీజాన్ని నాటడంతో కథా సంవిధానమునకు, పాత్ర పోషణకు చక్కని అవకాశం కుదిరింది.

సంస్కృత హరివంశం పారిజాతాపహరణానికి మూలం. హరివంశ కథలెల్ల నాను పూర్విగ నిట్లు విని కృతార్థుడనై తిని. అన్న తిమ్మనపద్యమే దీనికిసాక్ష్యం. అయితే కన్నడంలో హరికథాసారాన్ని అనుసరించి రచించాడని ఒక వితండ వాదం కలదు. కాని కన్నడ హరికథాసారం ముందు పుట్టిందో లేక తిమ్మన పారిజాతాపహరణం ముందు కలదో తేల్చవలసియున్న విషయమే.

తిమ్మన ప్రారంభంలో రచించిన 'పాలతుల్ కౌగిట...' అను ప్రార్థనా పద్యంలో పార్వతి అసూయ రుక్మిణీ - సత్యభామల సపత్నీ మాత్సర్యానికి సూచకమైనట్లే చిన్నాదేవి - తిరుమల దేవుల మధ్య గల అసూయకు చిహ్నం. 'సరసపు టలుకదీర్చి తరి శార్ఙ్గ సుదర్శన ...అను పద్యంలో లక్ష్మీదేవి ప్రణయకోపాన్ని హరి తొలగించి ఆనందింప చేశాడంటే ప్రకృత కథలో కృష్ణకర్తృక సత్యభామా సాంత్వనం జరుగనున్న దను మాట. పట్టపుదేవి ప్రణయదుఃఖాన్ని రాయలు తొలగింప చేయగలడని సూచన. ఏ కావ్యమునందును ఆదిలో కానరాని చంద్రవర్ణనము నవలీమల అల్లువాడు... అని తెలుగు పదాలతో ముద్దుపల్కు

లలో రచించి తిమ్మన తన విశిష్టతను చాటుకొన్నాడు.

'ముక్కు తిమ్మనార్యు ముద్దుపల్కులు' మొదటి ఆశ్వాసంలోనే ముచ్చటించబడినాయి. కథన శిల్పం ఈ ఆశ్వాసంలోనే సానలు తీరింది. ప్రేటువడ్డ యురగాంగన వలె లేచిన సత్యభామకథతో పారిజాతాపహరణపు ప్రారంభం. సత్యభామ ప్రేమ స్వచ్ఛమైనా తిరుమలదేవి ప్రేమ వలె సాహంకారం. రుక్మిణీదేవి ప్రేమ చిన్నమదేవి ప్రేమవలె ప్రశాంతము. ఆ రెండుపాత్రల మధ్య అంత తేడా ఉంది. దక్షిణ పార్శ్వం అదరగా తన ప్రాణనాథుడు వేరొక చపలాక్షితో కూడి తన కిష్టము గాని పని చేసినాడేమో అని వగచుచుండ పుష్పధారణచే రుక్మిణి సానబట్టిన మకరాంకుని శస్త్రంవలె ఉందని చెలికత్తె ముఖాన విన్న సాత్రాజితి నేయిపోయ భగ్గున దరికొన్న హుతాశన కీలవలె లేచి 'ఏమేమీ కలహాశనుండు' అని నారదమునిని నిందించినది. అంతటితో ఆగలేదు. రుక్మిణీ కృష్ణులను ఎత్తిపొడిచి నాగతరుణివలె మాసిన చీర గట్టుకొని పోయి పడకటింటిలో జలదాంత చంద్రరేఖాసదృశాంగియై పొరలి మనోజ విషాద వేదనను అనుభవించిందట. అనికిన్ బలసూదను డెత్తి వచ్చినా వానిని ద్రోలి పారిజాతాన్ని పెకలించుకొని వచ్చి పెరటిలో నాటుతానని కృష్ణుడోదార్చితే సత్య కోపం చల్లారింది అంత పనీ జరిగింది. అది పారిజాతాపహరణం. నాతి తాపహరణం. నిరహంకార నిష్కళంక ప్రణయతత్త్వాన్ని 'పుణ్యకవ్రతం' మూలాన తిమ్మన సత్యకు బోధించడం అందలి ఉద్దేశం.

ప్రబంధ వర్ణనలు :_

ప్రబంధకవికి వర్ణన దృష్టి ప్రధానం. ఆ అవసరాన్ని కల్పించుకొంటాడు. 'అష్టాదశ వర్ణనాత్మకము ప్రబంధము' అని సామాన్య నిర్దేశం. ఘనపదార్థంగా ఉన్న విషయాన్ని ద్రవీభూత మొనర్చుటయే వర్ణన. భామహుడు సర్గబంధాన అష్టాదశవర్ణన లుండాలన్నాడు. అవి సాహిత్యదర్పణంలో, అలంకారశేఖరంలో ముప్పదివరకు పెరిగాయి దండి. తొట్టతొలుత పదునెన్మిది చెప్పాడు.

'నగరార్ణవ శైలర్తు
 చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా
 మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ
 కుమారోదయ వర్ణనైః
మంత్ర ద్యూత ప్రయాణాది
 'నాయకాభ్యుదయై రపి'

ఈవర్ణనలలో కథాగమన నిరోధకాలు ఔచిత్య భంజకాలు నగువానిని తిమ్మన అతి జాగరూకుడై పరిహరించెను. కథాప్రారంభం నాటికి ప్రకృత ప్రబంధనాయికా నాయకులు వివాహితు లగుటచే తత్సంబంధ వర్ణనలకు సావకాశం లేదు. సూర్యోదయాస్తమయాది వర్ణనలందు సంప్రదాయ విషయాల్ని జోడించి రచన గావించడంలో తిమ్మన నేర్పరి.

'జలరుహమిత్రుం డాత్మరుచి
 సంపదఁ జీకటి బందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి
 కైకొనె నమ్మిక కాఁపులంచుఁ జూ
క్కుల దొర యెండ దాడి విని
 గ్రక్కునఁ దానును గాంతి వీనిలో
పల నెల కొల్ప నాఁ బలుకఁ
 బాటె నిశాంత నిశాంత దీపముల్'

'ఆదిత్యో వా అస్తమయ న్నగ్ని మను ప్రవిశతి' అన్నది శ్రుతి. సూర్యుడు చీకటికి భయపడి గృహదీపములందు తన తేజస్సును దాచుకొన్నాడట. అది తెలిసికొన్న చంద్రుడు తన వెలుగును దీపములందే దాచుకొనగ వెలవెల పోయినదట. అంటే అది సూర్యాస్తమయం ఇది భానూదయం. దీపమునందు అగ్ని ధర్మాన్ని ఆరోపించుట కవి చమత్కారం.

ప్రాతఃకాలంలో పద్మాలు వికసించుట తుమ్మెదలు ఆ కమలముల నుండి ఝుంకారముతో వెలికివచ్చుట సర్వసామాన్య మనోహరదృశ్యం. నంది తిమ్మన ఆ మకరంద మాధుర్యాన్ని గ్రోలిన మధుకరముల స్థితి నిట్లు ఉత్ప్రేక్షించాడు.

'కమ్మకస్తూరి గుళికలు తమ్మిలేమ
నిదుర మంపున బుక్కిటనించి, మేలు
కాంచి వేకువ నుమిసె నా, కమల ముకుళ
కోటరంబుల వెలదేటి కొదమ లెగసె.'

ఆ తమ్మిలేమ రాత్రి కమ్మని కస్తూరి మాత్రలను బుగ్గలో వేసికొని నిదుర మైకంలో నమలక నిద్రలేవగనే వేకువన వాని నుమ్మివేసెనో అన్నట్లు పద్మముకుళములనుండి రోలంబములు బయటికి వచ్చినవట. ఇది తిమ్మన మనోహర వర్ణన.

ముక్కు తిమ్మన పల్కు ముద్దుముద్దుగా ఉండటంసరే. ఆయన యేడ్పుగూడ ముద్దుముద్దుగానే ఉంటుండట. అది వినువారికి వినసొంపుగానే ఉంటుంది.

'ఈసున బుట్టి డెందమున
 హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు
 కట్టెదుటన్ అలివేణి పంకజ
శ్రీ సుఖమైన మోము పయిఁ
 జేల చెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయ కంఠ కల
 కంఠ వధూకల కాకలీ ధ్వనిన్'

ఆ యేడ్పు ఆమకోయిల యొక్క అవ్యక్త మధుర రుతమువలె ఉందట పట్టి కోయిల గాదు. లేచిగుళ్ళను తినడంచేత గంతరించుకొన్న మాధుర్యంగలది ఆ కోయిల. గాసిలి యేడ్చినయేడ్పే అంత మధురంగా ఉంటే యింక నామె మధుర భాషణము లెట్లుండవలెనో గదా.

ప్రబంధ రసం :_

రసవిశిష్టమైన నిర్మాణము వినిర్మాణము. అట్టి రసోత్కృష్టమగు మహాకావ్యమే మహాప్రబంధం. కావ్యోత్కర్ష కల్గింప గోరుకవి ఒక్కదానిని ప్రధానరసంగాను, తక్కినవానిని అంగములుగాను కూర్చుట యుక్తతర మని ఆనందవర్ధనాచార్యుల మతము.

'ప్రసిద్ధేఽపి ప్రబంధానాం
 నానారస నిబంధనే

ఏకో రసోంగీ కర్తవ్యః
తేషా ముత్కర్ష మిచ్ఛతా'

కాని ప్రబంధం శృంగారరసప్రధానం. తక్కినవి అంగరసాలుగా చేయడం సామాన్యం. పారిజాతాపహరణ ప్రబంధమొక శృంగార రసవాహిని. ఆ వాహినిలో ఆనందాన్ని పొందని సహృదయుడుండడు. మాధుర్యగుణ ప్రతిష్ఠితమైన శృంగారానికి అంగభూతముగా వీరాన్ని సూచించడం జరిగింది. వీరం అహంకార స్వరూపంకాగా తదహంకారనాశకం ఆనందాంశమైన కామం. అదే నిరహంకారాత్మకమైన శృంగారం. ఇందులో శృంగారానికి ఆలంబన విభావాలు సత్యాకృష్ణులు. అహంకారానికి దూరమైనదేదో అది పరిశుద్ధ శృంగారం. అది నిష్కళంకమగు ప్రేమ తత్త్వం. ఈ తత్త్వ స్వరూపిణి రుక్మిణి. సాహంకార స్వరూపిణి సాత్రాజితి. సంయోగ – వియోగ శృంగారాత్మకం ఈ కావ్యం. ప్రథమాశ్వాసం వియోగం. కావ్యప్రారంభం, తరువాత అంతా సంయోగం రసం అనుభావ ముఖంగానే ధ్వనించాలి. అందుచేత

'సరసపుటల్క దీర్చు తిరి
శార్ఙ్గ సుదర్శన నంద కాబ్జ సం
భరణ గుణాప్తి నెన్నడుము
పై కటిపై జడపై గళంబుపై
హరి నలుగేలు పైకొన సు
ఖాంబుధి నిచ్చలు నోలలాడు నిందిర'

– శృంగార మాధుర్య వ్యంజకమైన దీ పీఠికా పద్యం. హరి నలుగేలు ఇందిరను స్పృశిస్తే సుఖానుభూతి పొంది సుఖాంబుధిలో ఓలలాడింది. అల్క దీర్చడంలో ఇందిర అవయవ స్పర్శకి హరి ఆయుధ స్పర్శతో పోలిక శార్ఙ్గం – నెన్నడుము. సుదర్శనం కటి, జడ – నందకం, గళమబ్జం, శంఖం. 'ఉపమానోపమేయ' భావ తాదాత్మ్యం చిత్రిత శృంగారోచితం. ఆమె సౌందర్యమంతా దివ్యమూ పవిత్రమూ. కాబట్టి భర్త ఆయుధాలు ఆమె కలంకార సౌందర్యం. ఆ పురాణ కథాంశాన్ని ఇలా శృంగారంలో గతార్థం చేయడం రసశిల్పం.' – ఈ రసానుభవ పరామర్శ డా. కోటీశ్వరరావు గారి సహృదయ విమర్శ. ఆయుధాలు శృంగార పోషకాలుగా చిత్రితం కావటంలో వీరం శృంగార పోషకంగా చేయబడటమే.

సత్యాదేవి మనోజబాధలను, మదనతాపాన్ని ముక్కు తిమ్మన రససారంజకముగ వర్ణించాడు.

'వెడ వెడ గన్ను మూయు, గను
విచ్చున, గుందళయూచు బాన్పుపై
బడు, నుసురంచు లేచు దడ
బాటును దత్తరముం జలంబులో
నడరగ ...'

ఇవి శృంగార రసోద్దీపన చేష్టలు. తదనుగుణమైన వ్యభిచారి భావాలు. అవి శృంగార నాయిక అగ్గలమైన మనోజబాధలను ధ్వనిస్తున్నవి. కృష్ణుడువచ్చి బతిమాలితే ఆమె 'ఉవిద యెవ్వతె నోచి యున్నదో యీశ్యమంతకమణి నింక నౌదల ధరింప అనియు, సౌధము కిటికీల నుండి యికముందు ఎవ్వతె సముద్రాన్ని చూచునో అనియూ, అంటుంది. ఆమె దుఃఖ మది కిటికీల నుంచి వారిద్దరు వార్ధిని చూడటం శృంగార మాధుర్యం.

జలక్రీడాదుల వర్ణన యందు సంభోగ శృంగారం ధ్వనితం. వదలిన నీవి బంధములు, వాడిన మోములు, జారు కొప్పులు గలవారుగా ఉన్నారట ఆ స్త్రీలు. రతిశ్రమాలసలైన స్త్రీల పరిస్థితి అంతే కదా! పండు వెన్నెల్లో తుషారపు తుంపురులను కవి మనోహరంగా ఉత్ప్రేక్షించాడు. కుముదలక్ష్మి వధువు. శశాంకుడు వరుడు. ఆ ప్రియురాలిని శశాంకుడు పాణిగ్రహణం చేయబోతే ఆ నవయౌవనవు ప్రియుని హస్త స్పర్శచే చిరు చెమట కల్గిందట. చెమట యిక్కడ చిరుమంచు. అది సాత్త్విక భావ సూచకం. నాయికా నాయకుల మధ్య ఏర్పడే అనుభావాన్ని ధ్వనింప చేసి శృంగార రసాంగంగా రంగరించాడు కవి.

అదితివృత్తాంతం, ఇంద్రవృత్తాంతం కథాగమనమునకు తోడ్పడినవి. నారదాదుల చతురోక్తులు, కృష్ణస్తవము శాంత రస ప్రధానం. ఇవి అన్నియు ప్రధాన రసమైన శృంగారమునకు పరిపుష్టి చేకూర్చినవి.

ప్రబంధ పాత్రల సృష్టి :-

రాయల నాటి సంప్రదాయ ధర్మాల్ని సమన్వయింప చేసికొన్న సంప్రదాయ మర్మజ్ఞుడు మన తిమ్మన. ఆ నాటి జీవన విధానాన్ని ప్రబంధ పాత్రలలో ప్రత్యక్షీకరింపచేశాడు. సపత్నీ మాత్సర్యంతో కన్నుగానక ప్రవర్తించిన ప్రబంధ సుందరి సత్యభామ. కోపం చెందిన స్త్రీ ముందువెన్కలు గమనింపక యెంతటి వారలైనను గణింపక మాట్లాడుట లోక సహజం. అట్టి కోపోద్రిక్త హృదయకు ప్రతిబింబం సత్యభామ పాత్ర. బ్రహ్మమానస పుత్రుడైన నారదుని 'కలహాశనుండు' అనియు, జగన్నాటక సూత్రధారి శ్రీహరిని గోపికా వల్లభుడనియు నిందిస్తుంది. ఆ కృష్ణుడు సత్యను నమస్కరింపబోతే జలజాతానన పాదంతో త్రోసివేసింది. పారిజాత వృక్షాన్నే పెకలించుకొనివచ్చి యిస్తానంటే ముందుగల కోపాన్ని ప్రక్కన పెట్టి వికసించిన మోము గలదైనది. తను కావాలన్న వస్తువు యివ్వనప్పుడు ఏడ్చి ఇస్తానంటే సంతోషపడే పసిపిల్లవాని మనస్తత్వానికి ప్రతీక సత్యభామ. ప్రబంధంలో శ్రీకృష్ణుడు చక్రవర్తి. అంతేకాదు. సత్యభామా వశంవదుడైన ఒక శృంగారనాయకుడు. మానవత్వపు హద్దుల్ని దాటిపోని మహానుభావుడు – ఆదర్శ పురుషుడు. అయితే కొందరిదృష్టిలో రమణీలోలుడగు రసికుడు. స్త్రీకోరిక మేరకు అన్యాయం

గావించిన వాడు. మరికొందరి విషయంలో పరతత్త్వం దివ్యతత్త్వం, తిమ్మన కృష్ణుని యందు విశ్వగురుత్వాన్ని, విష్ణుత్వాన్ని ప్రతిపాదించి జగన్నాటక సూత్రధారి యనే సత్యాన్ని ప్రతిపాదించాడు.

దురహంకార ప్రేమతత్త్వానికి, నిరహంకార నిష్కళంక ప్రణయతత్త్వానికీ మాత్సర్యగల స్పర్ధయే ఈ నాటక ప్రాతిపదిక. తన అందానికి తానే గర్వపడుచు విఱ్ఱవీగు సవతుల నెవ్వరిని లెక్కచేయని అహంకార స్వరూపిణి సత్యభామ. ఆ అహంకారాన్ని పోగొట్టడానికి దేవర్షి దివ్య సౌరభం వెదజల్లే పారిజాత ప్రసూనాన్ని కృష్ణునిచే రుక్మిణి కిప్పించాడు. ఇచ్చట నారదుడొక కృష్ణసఖునిగా కనబడతాడు. సత్యభామ భూదేవితత్త్వమైతే, రుక్మిణి శ్రీదేవితత్త్వం. ఆమె ప్రేమస్వరూపం. ఈమె భక్తిస్వరూపం.

ప్రబంధశైలి :–

కవియొక్క శీలము శైలిరూపంలో ప్రత్యక్షమగును. శీలము కవియొక్క భావనాశక్తి. ప్రబంధశైలి అలంకారిక శైలి ఆంగ్లమున దానిని Florid Style అంటారు. అది శబ్దాలంకార శోభితము. ఇచ్చట అదే ముక్కు తిమ్మనార్యుని ప్రతిపద విన్యాస చమత్కృతి. అది సుకుమారమనోహరం. 'వసంత కాలంలో పుష్పము లోని పరాగరేణువుల నుంచి తుమ్మెదలు ఎగిరి పోవుచున్నట్లుంటుంది సుకుమార శైలి' అని కుంతకుని ఉక్తి. అట్టి తిమ్మన కవిత్వానికి మాధుర్యమే శరీరం మాధుర్య గుణశోభితమైన తిమ్మనార్యుని పద్యము క్రిందిది

'జలజాతాసన వాసవాది సురపూ
  జాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుఁ గన్నతండ్రి శిరమ
  చ్చో వామపాదంబునన్
తొలగం ద్రోచె లతాంగి యట్లయగు నా
  థుల్ నేరముల్ సేయ పే
రలుకం జెందిన యట్టి కాంత లుచిత
  వ్యాపారముల్ నేర్తురే'

నాటకీయ రచనగూడ తిమ్మనలో ద్యోతకమౌతున్నది. ప్రథమాశ్వాసాన్ని మూడు భాగములుగా విభజించిన దేవలోకమునుండి తెచ్చిన పారిజాతాన్ని నెత్తమ్మి చిగురుటాకువ బోడివి కృష్ణునికిస్తే సత్యను దలచి ప్రక్కనున్న రుక్మిణికిచ్చుట మొదటి రంగము. సత్యభామ చెలికత్తె ప్రవేశం నాటకోచితం. రుక్మిణి గృహమున జరిగినవృత్తాంత మెరింగించుట రెండవరంగము. ఇచ్చట 'By Contrast Method' ను తిమ్మన ప్రవేశపెట్టాడు. ఇదే రెండు సమానమన స్త్రీ పాత్రల మధ్య నడిపించిన సంభాషణ. కోపగృహ ప్రవేశమైన సత్యను కృష్ణుడు ఓదార్చుట మూడవరంగం. ఇట్లు ప్రథమాశ్వాసంలో నాటకీయత సాధించబడి నాటకం వలె రక్తి గట్టింది ఈ ప్రబంధ పారిజాతం. ఇట్లు సర్వ ప్రబంధ లక్షణ సమోపేతముగా వెలసిన ప్రబంధ ప్రసూనం పారిజాతాపహరణం.

ఆధారం: 'పారిజాతాపహరణ పర్యాలోచనం.'

—...—



## భారతధరణీ

అభినవ కాళిదాస
శ్రీ తెల్కపల్లి రామచన్ద్రశాస్త్రి

*చిరకాలిక పరపాలన
  ఖర శృంఖల గలితే !
కలభారత మహితస్మృతి
  విధిపాలన ముదితే ।
సురసంతతి నిలయామల
  హిమ భూధర కలితే !
జయభారత ధరణీశ్వరి !
  ఖగవాహన వనితే ।

* నవమంజుల మిహిరద్యుతి
  కనకాంబర లసితే ।
ఘనకానన తరు పల్లవ
  రుచి కఞ్చుక మిలితే ।
రశనాయిత జలధే! కృతి
  జన మానస సుఖదే ।
జయభారత ... ...

*వరకాఞ్చన మణి సన్తతి
  ఖనిపూరిత హృదయే ।
బహుపావన సరి దూర్జిత
  జలపోషిత కలమే ।
శరణాగత పరిపోషణ
  పటుధార్మిక తనయే ।
జయభారత ... ...

*అకుతోభయ రణ సుస్థిర
  భట పౌరుష సహితే ।
నవభారత యువ విక్రమ
  లలితే ! మదభరితే ।
శర వఞ్చక రిపు సైనిక
  వనపావక సదృశే ।
జయభారత ... ...

* తత వైదిక మతసజ్జత
  మునిసంతతి వినుతే ।
సతతాతుల సరసామల
  ఫలభూరుహ లసితే ।

వితతాగమ గదితాద్భుత
తరభాసుర చరితే !
జయభారత ... ...

*వరసాత్విక తరజీవన
మిత సైర్నృప తిలకైః
పరికల్పయ బహుకార్మిక
జనతా భృతి మతులామ్ !
సచరాచర భరధారిణి !
తనుశాస్త్రవ విలయం
జయభారత ... ...

*పరిపాలన వినికృంతన
విధిధిక్కృత విభవాన్
తనయాం స్తవ జపహార్ముఖ
విదుషస్థిర యశసః !
న చ విస్మర సురనాయక
పుర సుస్థిర వసతీన్
జయభారత ... ...

* పరివర్ధయ పరివర్ధయ
ధనసస్యజ ముదయం
పరిపాలయ పరిపాలయ
వితతం జననిచయమ్ !
పరిపోషయ పరిపోషయ
సుపరిశ్రమ సరణిం
జయభారత ధరణీశ్వరి!
ఖగవాహన వనితే !

—...—



# సాహిత్యంలో శకుంతలా పాత్ర పరిశీలనము

- శ్రీమతి డా. పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

**కృష్ణకవి - శకుంతలాపరిణయము.**

నన్నయ, పినవీరనల కావ్యముల ననుసరించినను, లోకసామాన్య బాలికవలె శకుంతలను తీర్చిదిద్దినవాడు కృష్ణకవి. ఈమె కాళిదాసు శకుంతలవలె వృక్షసేచనము చేయుచున్నట్లుగా గాక, అట్టి పనికి చెలులనునియమించి తానుద్యానవనసమన్వేషణము చేయుట మొదలిడినది. పక్వదాడిమీఫలయుగళమును ముక్కున నొక్కుచున్న బాలశుకము నొక దానిని చేవిరిబంతిచే నదల్చినది. అది శుకమును తాకుటకు మారుగ, పూపొదలయందు విశ్రమించిన దుష్యంతుని దాకినది. అది యాధారముగ దుష్యంతుడు రంగస్థలముపై కరుదెంచినాడు. ఇది కృష్ణకవి చేసిన శకుంతలా దుష్యంతుల తొలిపరిచయము. అప్పటికే పొదలమాటున నుండి శకుంతలను చూచి కామార్తుడైన రాజు ఆమెనుగూడ తనయందు మరులుకొన్న దానినిగ భావించి సాభిప్రాయ సంభాషణ మారంభించినాడు.

ఏకాంతమున స్వేచ్ఛగ సంచరించుచున్న శకుంతల ఇట్టి ఆకస్మిక మధుర గంభీర సహాలాపములకు లజ్జాభయపరాధీనయైనది. చకితకురంగశాబము కరణి ఉలికిపడి, నలుదెసలు పరికించి, రాజును చూచినది. చూచుటతోడనే పంచశర సమాక్రాంతయగు శకుంతల చూపులు ప్రేమార్ద్రములు, భావవ్యంజకములు, హృదయరంజకములు, లజ్జాలోలంబులునై అతని నుండి మరలుటకు విముఖములైనవి. శకుంతల ఇతఃపూర్వము కణ్వదర్శనార్థ మరుదెంచిన ఎందరో త్రివిష్టపలోకవాసులను చూచినది, కాని యింతటి భావసంచలనము పొందలేదు. పినవీరన శకుంతల ఈతని పరిణయమాడు భాగ్యవతి ఎవరా అని భావింపగా కృష్ణకవి శకుంతల తన్నాతడు పరిగ్రహింపకుండిన తనజన్మము విఫలమని తలచినది. ఇంతటి కనువేదురు పొందినను ఉచితానుచితములు మరవలేదు. సంతాపదురితంబగు నిజస్వాంతము చిక్కబట్టి, అతనిని ఆశ్రమమునకు వచ్చి అర్ఘ్యపాద్యములు గొను మని ప్రార్థించినది. ఇట్లు ఈమె ఎంతటి భావలోలయైనను కర్తవ్యము మరవని వివేకవతిగ తీర్చిదిద్ది, పినవీరన శకుంతలలో లేని ప్రాణప్రతిష్ఠను తన నాయికయందు కలిగించినాడు కృష్ణకవి.

దుష్యంతుడు గాంధర్వ వివాహమున తన్ను స్వీకరింపుమని పలుకగా శకుంతల యిట్లు పలికినది.

నాకు స్వజనకుం డెఱుంగని విధా
నం బెట్లు గావింప నౌ!
లోకుల్ మెచ్చరు మిమ్ము మాని తన యా
లోలాత్మకుం డంచు సు
శ్లోకుండై తగు తాతకాశ్యపుడు వ
చ్చున్ మెచ్చు నిచ్చున్ ననున్
మీకు న్నాయ సరోరుహాననుండు బ
ల్మిం గూర్చ నైనచోన్.

(శకుం. ప. ఆ 2 ప. 75)

తండ్రి అనుమతి లేకుండ వివాహము చేసికొనుట ఆమె కభిమతము కాదు. ముని తనయాలోలాత్మకుడను అపవాదు అతనికి కలుగును. అది ఆమె కసమ్మతము. తమ యిద్దరి వివాహము విధిలిఖితమైనచో

కాశ్యపుడే ఆపని యొనర్చును గాని, యింతలో తొందరపడి అపవాదులు పొందరాదు. అను శకుంతల పలుకులు ఆమె వివేచనా పటిమకు పితృభక్తికి నిదర్శనములు. భారతమునందలి శకుంతల మరల పునరుజ్జీవనము పొందిన దైనది. ఆర్యుల చాటుదావ నని. నలుగురిలో ఈ పని చేసి నవ్వు కొన్నాల నాయని, రాజుల పొందు కోరదగునా అని తత్తరము దగునా యని ఆలోచించినది. ఇది శకుంతల మనోనిగ్రహమునకు నివేచనా పటిమకు ధైర్యవిభవాతిశయమునకు నిదర్శనము.

విరహానల సంతప్యమాన మానసుడై, శకుంతలా సాంగత్యము పొంద తమకించిన రాజుతో, కణ్వుడు వచ్చి తన్నర్పించునని గాని, గాంధర్వవిధిని అప్పుడు వివాహమాడునని గాని, లేనిచో తన్ను అగ్రభాగ్యగ నేలుకొనునట్లుగ, తన సుతునకు మహీవలయము ఇచ్చునట్లుగ వాగ్దానము చేయుమని గాని పలికినది. ఒక సమస్యను ముందు వెనుకలుగా ఆలోచించి, నిర్ణయము తీసికొను శకుంతల మనస్తత్వమిట గోచరించుచున్నది. అంతియగాక రాజు ఆమెతో అనుభవమునకు ఆతురత చెందుచున్నాడు కాని వివాహమును గూర్చిన ఊసు లెత్తలేదు. అందుచే తనను యథావిధిగ వివాహము చేసికొను మని కర్తవ్యము నెరుకపరచినది. అతడంత ఓరిమి వహింపలేనిచో తాను కోరిన వరములిచ్చి పరిణయ మాడు మని పలికినది. భారత శకుంతల పుత్రుని రాజ్యాభిషేకమును మాత్రమే కోరినది. కాని కృష్ణకవి శకుంతల తన కగ్రమహిషీత్వమును కూడ కోరినది. అదియు 'హితమ్మగు నేని' ఇట్లు ఈ శకుంతల కాశ్యపుల గౌరవమును' దుష్యంతుని అనురాగమును గూర్చి యోజించి, పిదప తన్ను జనులు పరిహసింపకుండునట్లుగ, తనయునకు రాజ్యము తన కగ్రమహిషీత్వమును వరములుగా బడసి, పిదప అతని కోరిక చెల్లించుటకు అంగీకరించిన ప్రతిభాశాలిని.

దుష్యంతుడు నగరాభిముఖుడై ఆమె అనుమతిని కోరిన సమయమున ఈమె, భారత కాళిదాస శకుంతల వలె మౌనము వహించలేదు. కన్నుల గ్రమ్మిన బాష్పపూరములతో, గాటంపు నిట్టూర్పులతో అతని వెంట నడచి, 'ప్రాణనాయక! నిన్నెడబాయజాల, దోడికొని పొమ్ము నన్ను నీ తోడ నెమ్మి' అనికోరినది. ఇది తీక్ష్ణమైన భర్తృసాంగత్యము నెడబాయ నొల్లని చక్రవాక వధువు వంటి శకుంతల ప్రణయమునకు నిదర్శనము. ముని అనుమతిగొని రమ్మని బహుప్రకారములుగా దుష్యంతుడు ఒడంబరచిన చేయునదిలేక అతనిని వీడుకొలిపినది. ఇది కృష్ణకవి శకుంతలా పాత్రచిత్రణమున కనబరచిన మరియొక కళాకౌశలము.

దుష్యంతుడు నగరమునకు వెళ్ళిన పిమ్మట, శకుంతల అతని చేరవలయునని ఆకాంక్షించినట్లును, అతను పిలువనంపున వెత చెంది తన మనస్సును చెలులతో తెలిపినట్లును పూర్వకావ్యములం దెచ్చటను కానరాదు. కృష్ణకవి తన కావ్యమున ఆ కొరతయు తీర్చి ఆమె అనవరతము పతిధ్యానైకచిత్త అనియు, భర్తృవిరహము చే తపించు చక్రవాక వధువు అనియు వర్ణించినాడు. దుష్యంతుడు వచ్చినట్లుగను తన్ను చేగదీసి లాలించినట్లును కలలుగాంచి మరింత దిగులు చెందినది. పెద్దలకు చెప్పుటకు వీలులేదు. తల్లిదండ్రులు వీర్యశౌర్య సువిద్యాసదాచార పుష్కలుడగు వరుని తెచ్చి ఉద్వాహ మొనరించువరకును వేచియుండక, స్వతంత్రించిన సందులకు తగిన ఫలము పొందితివని వారు నిందింతురేమో అని ఆమె భయము. హితులనుపంపుదునని నమ్మపలికిన విభుపలుకు లన్నియు తన్ను నమ్మించుటకు చేసిన కైతవముగ భావించినది. చివరకు భరతుడు జన్మించి, యౌవరాజ్య పట్టాభిషిక్తుడగు వయసును పొందువరకు వేచియుండినది. అప్పటికిని అటు దుష్యంతుడు పిలువనంపడు. ఇటు కణ్వుడును ఆమె నత్తవారింటికంపు ప్రయత్నము చేయడు. స్వతంత్రించి తన అభిప్రాయ మెవరితో చెప్పుకొనుటకు వీలులేదు. చివరకు స్నిగ్ధజనులతో పంచుకొనినపుడే దుఃఖము సహ్యావేదన మగు నని తలచి ప్రియంవదతో చెప్పి కొంత ఉపశమనము పొందినది. ఇట్లు చిరకాలము వల్లభుని మన్ననలకు దూరమై పుట్టినింట కాలము గడపు ఆడుబిడ్డ సహజలక్షణము లన్నియు శకుంతల పాత్రయందు కనబరచి, కవి ఆమెను అలౌకిక నాయికగా గాక, సామాన్యలోకమునకు సన్నిహితముగ చిత్రించి తన కళాకౌశలమును నిరూపించుకొనినాడు.

శ్వశుర గృహమునకు బయలు దేరిన శకుంతల ఆశ్రమమును వీడలేక, దుఃఖవివశయైన విధమును పూర్వకవులు వర్ణించినారు. దుష్యంతుని చేర నుత్సహించి, అతడు పిలువ లేదని కుందుచున్న శకుంతల నేడు అతని చేరబోవు సమయమున, అధీరగాను అంతగా విలపించుట బేలతన మని సించుకొను నని యెంచి కాబోలు కృష్ణకవి ఈ సందర్భము నంతగా వర్ణింపలేదు. కేవలము 'డెందమున కుందుచున్న యది,' అని ఒక్క మాటచే సూచించి వదలినాడు.

రాజమందిరమున ప్రవేశించిన శకుంతల సకల సామంత పరివారసమేతుడైనట్టి దుష్యంతుని చూచి ఈ విధముగ తలచినది.

'ఈ మహనీయమూర్తి సభ
కేగతిఁ జేరగవచ్చు జేరి నే
నేమని పల్కుదాన జను
లెల్లను నవ్వగ బూర్వవృత్తమీ
ధీమణితో వచించుటకు
దీమసమెయ్యది యిట్టులైననా
హా! మది గట్టువాపడతు
లం దొక దానిగ నన్ దలంపరే,
శకుం. ప. ఆ. 3. ప. 117.

అశేష శేముష ధురంధరులతో కూడిన రాజసభను చేరుటకు స్త్రీ సహజమగు బిడియముచే ఆమె భయపడినది. తనవృత్తాంత మంతయు జనులు పరిహసించుట కనువైనట్టిది. అట్టి దానిని ధైర్యముతో అందరి ముందు వచించినచో, తనను స్వేచ్ఛాచారిణిగ జనులు భావింతురేమో అను భయము. రాజును సభామధ్యము నందు గాక అంతఃపురమున ఏకాంతముగ కలియవలయునన్న, అచటి సరోజముఖులు తన్ను చేరనీయరేమో అను సంశయము. ఇట్టి శకుంతలా డోలాందోళిత హృదయమును కవిచక్కగా ప్రదర్శించి తన కావ్యకల్పనా కమనీయతను రుజువు చేసికొనినాడు.

దుష్యంతుడు తన్నెఱుగనట్లు నటింపగా, భారతశకుంతలవలె ధర్మాధర్మములను గూర్చి వివరముగ పలికినది, ఆమె నోచిన నోములు సఫలములైనచో. అపుడు గాంధర్వమునకు సాక్షులుగ గ్రహించిన దేవతలు ఇప్పుడు ప్రత్యక్షమై, తన పాతివ్రత్యమును ఋజువు చేయగలరని తలచి ఆత్మవిశ్వాసముతో, భక్తిభరితయై ఆ దేవదేవుని ప్రార్థించుచు నిలిచినది. చివరకు ఆమె కోరిక తీరి ఆ దేవతలందఱును ప్రత్యక్షమై, పాతివ్రత్యమును నిరూపించినారు. ఈవిధముగా కృష్ణకవి శకుంతల పతివ్రత, భక్తి భావ హృదయ.

శకుంతలా పరిణయము:

పెద్దాడ నాగరాజామాత్యుడు:

'శకుంతలాపరిణయము' అని మరియొక కావ్యమును రచించినవాడు పెద్దాడ నాగరాజామాత్యుడు. ఈయన అకలంక కృష్ణకవికి సమకాలీనుడు. ఈకావ్య కల్పనలు న్నయగారి అడుగుజాడలలో నడచినను, కొంత కొంతగ మిగిలిన కవులు చూపిన ఆకర్షణలను కూడ సంతరించుకొన్నవి. ఈ కావ్యమున శకుంతల మదియం దెట్టి తొందరపాటును పొందని వివేకశీలగను, ఆమ్నాయ ధర్మవిధి విజ్ఞాన నిధానగను నిర్మలగుణాంభోరాశిగను దీర్చి దిద్దబడినది.

నాగరాజామాత్యుని కావ్యమునందు 'ఫలభరానత సహకార పాదపాగ్రశాఖ కెంగేల గొని పర్ణశాల ముంగల లలిత కందర్ప సామ్రాజ్యలక్ష్మి'వలె నిలచి దుష్యంతునికి కనబడినది శకుంతల. ఆమె సౌందర్యాకర్షణ ప్రభలచే దుష్యంతుడు సంకల్పాగ్నికి సమిధయైనాడు. కాని శకుంతల మాత్రము ఎట్టి మోహభ్రాంతులకు లోనుగాక, అతనికి ఆతిథ్య మిచ్చి, తనతండ్రి ఫలార్థియై వనమున కేగె నని, ఆతడువచ్చు వఱకును విశ్రమింపుమని, ఆతని ఆతిథ్యమును స్వీకరింపుమనియు పలికినది.

శకుంతలవలన నీ ఆమె జన్మవృత్తాంతమాకర్ణించిన దుష్యంతుడు, క్షత్రియ కన్యయగు ఆమె ఇన్నినాళ్లును రాజభోగములకు దూరమైన దని భావించి, ఇకనైన నన్ను పరిగ్రహించి, ఉద్వేల ఉద్దిష్ట సౌఖ్యముల తేలి యశము నార్జించుమని పలికినాడు. ఈ సందర్భమున శకుంతలచే నాగరాజామాత్యుడు యుక్తియుక్తమగు సంభాషణమునడపించినాడు. మొట్టమొదటగా లోకములో నవయౌవన స్త్రీ రూపలావణ్య జృంభిత లగు రాజకన్యలు పలువురుండగా, కందమూలాశన వ్రతయై నారచీరలు కట్టి, తాపసజీవితమును గడుపుచున్నట్టి స్త్రీని కాంక్షింతురా? అని పలికినది. చతురంభోనిధి ముద్రితాఖిల మహీసామ్రాజ్య మేలునట్టి చక్రవర్తి మునికన్యను ప్రేమించి వరించిన మిగిలిన రాజులు, సుహృద్బాంధవులు పరిహసించెద రని, నలుగురిలో ఆతనికి కలుగు గౌరవహానిని గూర్చి వివరించినది. కరుణానిధి యగు జనకుని అనుమతి పొందక, పరతంత్రత వహించి తమంత తాము వరులను వరించుట కులకన్యల లక్షణము గాదని పలికినది. ఫలసమిత్కుశాదులు గొని కణ్వుడు వేగ వచ్చు నని, అంతవఱకును 'అనంగ శిలీముఖజ్వలన సంతాపం బెదజొనుపక, తాలిమి వహించియుండు' మని కోరినది శకుంతల. ఈ పలుకులు ఆమె ధర్మనిరతిని చూపుచున్నవి. ఆమె మరియొక మాట పలికినది 'నీ మనంబే నరయిన్ బవహూక్తి నళయించితి నింతియకాని శంకలో నూన కో' అని - అనగా రాజునకు, అతని వైభవమునకు తాను తగదని తనపై విముఖత్వము కల్గునట్లు పలుకుట, మొదలగునవి యన్నియు రాజునకు తనపై గలిగిన అనురాగమును పరీక్షించుటకు, ఈప్రసంగమును బట్టి నాగరాజామాత్యుని శకుంతల ప్రౌఢత్వము వ్యక్తమగుచున్నది.

పూర్వకవులకావ్యములందు వలె ఇంట కూడ, ఈమె పుత్రుయౌవరాజ్యాభిషేకమును వరముగా కోరినది. దుష్యంతుడును వెనువెంటనే అంగీకరించినాడు. కాని శకుంతలకు ఆతని పలుకులందు నమ్మకము లేదు. రాజ్యవైభవభ్రాంతిలో తనకిచ్చినవరము మరచిపోవునేమో అను శంక మదిలో తనకు గలుగుచున్నట్లుగ పలికినది. తనలావణ్యాకర్షణలకు లోబడి రాజు ప్రస్తుతము వరములిచ్చి, అవి యన్నియు నిజమని తలచితివా? అవి పలుకునేమో! తను అతనికి వశంవద యగుట తగునా యని పలికిన ఈ పలుకులు ఆమె శంకాకలిత చిత్తవృత్తిని నిరూపించుచున్నవి. రాబోవు ఫలితములకు తగు సూచనలు ముందుగానే కనిపించు నని ఆగ్యోక్తి. కనుక ముందు జరుగబోవు కథ యంతయు ఊహించినట్లుగ, తనకు జరగబోవు అన్యాయము తెలిసికొనినట్లుగ పలికిన పలుకులచే కవి శకుంతలను మరింత ప్రౌఢగ చేసినాడు. ఇంతటి ధర్మప్రవర్తనముకలిగి, తగు జాగ్రత్తతో సంభాషణము నడపిన శకుంతల చివరకు

రాజు బలిమికి లొంగి పోయినది. అతడు రాజ్యయిన కేగు సమయమున 'భూపాల తిలక నీదు కోర్కి తీర్చుకొంటి సరసబుద్ధి నా కొసంగిన వరమీవు మఱవకుండ వలయు' అని పలికినది.

శకుంతల మనస్సునందు కరుణానిరతుడగు కణ్వుని యనుమతి పొందక స్వతంత్రించి నందులకు తన్ను జనులు మెచ్చదురాయనియు, కణ్వుడేమనునో అనియు భయపడినది. అందుచే ఎప్పటియట్లు కణ్వుడు ఆశ్రమమునకు తిరిగివచ్చిన వెంటనే ఎదురేగి నమస్కరింపక అతిభీతచిత్తయై పర్ణశాలయందు దాగినది. ఈ సందర్భమున కవి శకుంతల మనోవేదనను విపులీకరించి పూర్వ కవుల కావ్యములకు వన్నె బెట్టినాడు.

దుష్యంతుని సాహచర్య ఫలితముగ శకుంతల భరతునికి జన్మము నిచ్చినది. ఆ సందర్భమున కవి ఈ విధముగా రచించినాడు.

'భువనైక స్తవనీయ మా నిజతపో
   భూరి ప్రభావంబునన్
వివిధాపూప ఘృతోదనాదికము లా
   విర్భూతిగా తత్పదా
ర్థవిశేషంబుల గుంకుమాగరు హరి
   ద్రాపుష్పమాల్యంబులన్
నవలాలం బని పెన్ శకుంతలీమహో
   నందంబు ప్రాపింపగన్'

శకుం. ప. ఆ. 3. ప. 92.

ఇట కవి శకుంతల జన్మమునందుగల దివ్యత్వమును ఆమెతపోవిభూతి ప్రభావమును వర్ణించినాడు. ఆ ప్రభావముచే ఆమె వివిధాపూపములను సృష్టించి, ఆపదార్థములను, మాంగల్య ద్రవ్యములను స్త్రీలందఱకు తనివితీరునట్లుగ ఇచ్చిన దట. పుత్రోత్సాహముచే అన్నదానము చేయుట ఆచారము. స్త్రీ యగుటచే స్త్రీలందఱకును మాంగల్య ద్రవ్యములను బంచినది. ఇది నాగరాజామాత్యుని కల్పనము. శకుంతల సతీత్వము, పుత్రోత్సాహమును ఇందు వ్యక్తమగుచున్నవి. కణ్వమహర్షి ఆమెను అత్తవారింటికి పంపుటకు నిశ్చయించినాడు. ఈ సమయమున శకుంతల పితృవియోగాకలిత హృదయమును కవి చక్కగా వర్ణించినాడు. దుష్యంతుడు ఇన్ని సంవత్సరములు గడచినను శకుంతలను పిలువనంపలేదు. ఆ సమయమున శకుంతల

'అదయుల్ క్రూరతరుల్ బహిర్మధుర వా
   క్యారంభు లాత్మైక కా
ర్యదృఢస్వాంతులు మాయికుల్ మహితలా
   ధ్యక్షుల్ దదీయాను ర
క్తి దలంపన్ మృగతృష్ణ మేఘరుచి యెం
   తే నమ్మగా బోలదై
నం దిగధీశాదులు సాక్షులై వెలయుచుం
   డన్ శంక నా కేటికిన్'

శకుం. ప. ఆ. 3. ప. 175.

అని పలికినది. రాజులను ద్వేషించునట్టి భావము చివరి వాక్యముచే తలకిందులైనది. వారందరిలో దుష్యంతుడు పృథగ్భూతుడైనాడు. పతివ్రతయగు స్త్రీ భర్తను ద్వేషించుట దోష మగును. కనుక ఆదోషమును నేర్పుగ తొలగించి, ఆమె సతీత్వమును, ఆమెకు భర్తపై, దేవతలపై,గల విశ్వాసమును ప్రకటింప చేసినాడు కవి. ఇది శకుంతల పాత్ర చిత్రణలో అతడు చూపిన కౌశలమునకు చిహ్నము.

రాజాస్థానమున ప్రవేశించిన శకుంతల తీరుతెన్నులు, ప్రసంగ విధానము భారతమునకు అనుకరణము. ఎన్ని విధములుగ వివరించినను రాజు తన్ను గుర్తించియు గుర్తించనట్లు పలుక, చింతాడోలాయమాన మానసయై, ప్రియమైన భర్త, తల్లిదండ్రులు అందరును తన్ను పరిత్యజించినారని దుఃఖించు విధమును ఈకవి మరికొంత వివరించినాడు. 'అభీష్టభోగముల జిక్కి సదాప్రియ భర్తగాఢ దోస్తంభకృతో పగూహన ముదారసుఖాప్తి' పొందుట ప్రాక్తనపుణ్య విశేష మనియు, కనుక మదియందు దుఃఖించుట వ్యర్థమనియు, వసుంధరలో అసత్యము ప్రబలి సత్యమున శింపగాతనయట్టివారికి ఆలనము లేదనియు తలచి ఆప్రదేశమును వీడిపోవ నూహ చేయుచున్న దానినిగ కవి శకుంతలను చిత్రించినాడు. సంస్కృత భారతము నందువలె కోపావేశవశంవదయై వాక్ప్రాగల్భ్యము పొందిన దానినిగ కాక, కవి ఈమెయందు నిగ్రహమును వర్ణించినాడు.

ఇట్లు పెద్దాడ నాగరాజామాత్యుని కావ్యమున శకుంతల వినయవివేకశీలగా, ప్రౌఢవివేచనా తత్పరమతిగ, పితృప్రేమామృతభరిత హృదయగా చిత్రింపబడినది.

శకుంతల, బాల్య చాపల్యముచే, యౌవన ప్రాదుర్భావముచే కొంత పతనము చెందినను, నిష్ఠుర వియోగానల తప్తహృదయయై, జీవితమున సంయమనమును పొంది, గృహస్థ ధర్మమున కనువగు స్థిరసౌదామినిని బోలు పరిణతమగు విజ్ఞానవివేకముల నలవరించుకొని, భర్తను చేరినట్టి విధమును వ్యాస, కాళిదాస, నన్నయ, పినవీరన, కృష్ణకవి, నాగరాజామాత్యులు తమ తమ కమనీయ కళాకౌశలములతో చిత్రించి, ఆమెను వాఙ్మయాంబరమున వెలుగు అద్వితీయ ధ్రువతారగ రూపొందించినారు.

—o—

# దిగంబర సాహిత్య పరిశీలనము

– శ్రీ సాంబయ్య పరిమి, ఎం. ఏ.

దిగంబర కవిత్వాన్ని రాసింది దిగంబరకవులు. వీరిది బాహ్య దిగంబరత కాదు– భాషాదిగంబరత–భావదిగంబరత. వీరు ఆరుగురు– నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు భైరవయ్య, మహాస్వప్న. వీళ్ళు వీరి కవిత్వానికి 'దిక్కులు' అని నామకరణము చేసారు. దిక్ లే అంబరముగాగల దిక్ కవిత్వమే దిగంబర కవిత్వము. ఆ కవులే దిగంబర కవులు. వీరు ఒక చోట 'ఇకనుండి దిగంబర కవులు తమ కవితా ఖండికను 'దిక్' అని ఖండికలను 'దిక్కులు' అని వ్యవహరిస్తారు. జబ్బుపొరలని చీల్చి కాస్మిక్ మార్గాన్ని నిర్దేశించేవే ఈ దిక్ లు. మా నవత్వపు విలువలు వీటి హద్దులు' అని చెప్పుకొన్నారు. వీరు స్వాతంత్ర్యానంతము పెరిగిన లంచగొండితనం, అవినీతి, అక్రమాలకు, అన్యాయాలకు ప్రభావితులై యీ కవితలు చెప్పారు.

అమెరికన్ సాహిత్యంలో కూడా యిటువంటి రచనలు ఉన్నాయి. వారిలో ప్రముఖుడు 'Angry young man' కాని యీ రచనలకు విలువలేదు. ఎక్కువ కాలం నిలువలేదు. కారణం భావదిగంబరత, భాషాదిగంబరత.

మన దిగంబర కవులు 'ఈ దేశంలో యీ భూగోళంలో ఊపిరి పీల్చే ప్రతి వ్యక్తి ఉనికికోసం తపనపడి అతని భావిని చూచి వెక్కి వెక్కి యేడ్చి పిచ్చెక్కి ప్రవచించిన కవిత' అని తమ ప్రథమ సంపుటంలో వ్యక్తంచేసారు. ఈ సంపుటాన్ని 1965 వ సంవత్సరం మే నెల్లో అర్ధరాత్రి ఒక రిక్షావాడికి అంకితం చేసారు.

వీరు 'మానసిక దిగంబరత కోసం నిత్య సచేతన ఆత్మస్ఫూర్తితో జీవించడమే మా ఆశయం. శ్వాసించే ప్రతివ్యక్తితో సారూప్యం చెంది వ్యక్తి అస్తిత్వపరిరక్షణ కోసం అంతరంగంలో అణిగి పడిఉన్న ఆరాటాన్ని వినుగును అక్షరాలతో వ్యక్తీకరించి నూతన విశ్వాసాన్ని ఆశను కలిగించాలని మాతత్వరత' అని చాటారు. అంతేకాక వీరు ఒక ప్రత్యేకమైన కాలమాన స్థాపన కూడా చేసారు. వీరి కాలమానంలో సంవత్సరాలు ఆరు–నగ్ననామ, నిఖిలేశ్వరనామ, చరబండనామ, భైరవనామ, మహాస్వప్ననామ సంవత్సరములు. వీరి ఋతువులు ఆరు–ఆశ, తపన, అశ్రు, మదిర, విరహ, విషాద ఋతువులు. వారాలు ఆరు–స్నేహ విశృంఖల, క్రాంతి, సృజన, వికాస, ఆనంత వారములు.

భాషా, భావ దిగంబరత్వముగల దిగంబర కవిత్వానికి కూడా కావ్య హేతువులు, కావ్యవస్తువు, కావ్యప్రయోజనం ఉన్నాయని వాళ్ళే చెప్పుకున్నారు వీరి దిక్ లను 'శార్దూల, మత్తేభాల మధ్య తమ కోపారుణ వీక్షణాలను పదును పెట్టే వాళ్ళకోసం –' అసహ్యం, అసమానం, ఆరిగి, పుచ్చి, కుళ్ళి, దుర్గంధాన్ని వెదజల్లే మాటల్ని, సమాసాల్ని, భావాలని పట్టుకొని వెళ్ళాడేవాళ్ళకోసం–రూపొందించారు'. అంతేకాక నేటి సమాజం గురించి–

'కాలం మారింది జీవితవిధానం మారింది అనుభవాల ఆకారం మారింది. మీరు ఊపిరి పీలుస్తున్న ప్రపంచంతో మీకు లేరు.' అని చాటి చెప్పారు.

'దేన్నీ నమ్మకు, నీ లోపల యీ మనసు లోపల యీ వంచన అంచుల క్రింద ఉన్న నీ అసలు స్వరూపాన్ని, నీ 'తనాన్ని' నమ్ముకో' అని ఆంధ్రావళికి ఆదరంతో హితోపదేశం చేసారు.

వీళ్ళు తమని గురించి 'మేముఆరుగురం మాలోని నిజరూపాల్ని దర్శిస్తూ, మా చుట్టూవున్న మనుష్యులందరినీ ప్రేమిస్తూ వాళ్ళని కూడా ఆ ప్రయత్నం చేయమంటున్నాం.

అందుకే మేము దిగంబర కవులం. మంచికోసం మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషికోసం కపటంలేని చిరునవ్వులు చిందే సమాజంకోసం అహోరాత్రాలు ఆరని అగ్నిలోంచి నడచిన ఆత్మలలోంచి పలుకుతున్న గొంతుకలం ... మేము మేముగా మాట్లాడదలచుకున్నాం. మా దిగంబర గొంతుకతో చెప్పదల్చుకున్నాం' అని సూటిగా సూది వలె మనస్సుకు గుచ్చుకునేట్లు చెప్పారు.

వీరు ఇట్లా చెప్పడానికి భావ తీవ్రత జుగుప్స, భయం, ఒకదానికంటె ఒకటి శతాధికంగా స్వీకరించారు. ఇది అంతా Emotional poetry కాని Poetry అనేది 'Emotions recollected in tranquility' అనే దానికి మాదలగా ఉండాలే కాని భావ తీవ్రత మాత్రమే కవిత్వం అనిపించుకోదు

నేటి సమాజస్థితిని గూర్చి చెరబండరాజు 'చూడలేను' అనే దిక్ నందు,

ఏ దేశంలో ఉంది శాంతి ?
ఎటు చూచిన భయ కంపిత
వడగాడ్పుల సుడిగాలుల సందడులే
శాంతిలేదు. వెలుగులేదు.
కారు మొయిలు చీకటులే
కంట కంట కనిపించును
చూపులలో చురకత్తులు కసరత్తులు.
మాటలలో పడగెత్తిన
నాగుబాము వోయారాలు.
చూడలేను చూడలేను
చూడలేను చూడలేను'–

అని విలపించారు. సంఘంలోని కశ్మలాన్నేగాక వ్యక్తివ్యక్తిలోని అవ్యక్త అశ్లీల వ్యక్తిత్వాన్నికూడ వలు దిక్కుల

వ్యాపించేటట్లు మహా స్వప్న 'నట సమ్రాట్' అనే దిక్సందు –

'నట సమ్రాట్
నువ్వెవరో నాకు తెలుసు
నీ వంట్లో నీ యింట్లో
సిర లెన్నో
అర లెన్నో
మర లెన్నో నాకు తెలుసును'–

అని నగ్న సత్యాన్ని విన్నవించారు. వీళ్ళల్లో ఒకడైన చెరబండరాజు 'వందే మాతరం' భారతీ దేవి దీనాన్ని భారత దేశహీనస్థితిని, భారతనారి మానాన్ని గురించి–

'ఓ ప్రియమైన మాతృదేశమా!
తల్లివి, తండ్రివి, దైవానివి నీవేనమ్మా
దుండగులతో పక్క మీద
కులుకుతున్న శీలం నీది
అంతర్జాతీయ విపణి లో అంగాంగం
తాకట్టు పెట్టిన అందం నీది
* * *
ఒంటి మీద గుడ్డలతో జండాలు కుట్టించి
వివస్త్రవై ఊరేగుతున్న ధైర్యం నీది
* * *
ఎండిన స్తనాల మీద ఎగపడ్డ బిడ్డల్ని
ఓదార్చలేని శోకం నీది
ఆకలికి ఎండి మాడి ఎరువు సొమ్ములతో
వీధినిపడ్డ సింగారం నీది.
అమ్మా! భారతీ! నీగమ్యం ఏమిటి తల్లీ!'
అని విలపించారు.

దేశంలో ఏవ్యవస్థలో చూసినా లంచ గొండితనం. అవినీతి, అకాల తాండవం చేస్తున్నాయి. వాటికి నిరసనగా ఈ కవులు తమ ఆక్రోశాన్ని అనేక సందర్భాలలో వ్యక్తం చేసుకొన్నారు. సమకాలీన జీవితం పై దిగంబర కవులదృక్పథం అను విషయంపై సాహిత్యంలో ఈనాటి జీవితంలో రాజకీయ వ్యవస్థలో జడత్వాన్ని వరించిన ఆంధ్రదేశంలో వారు కోరుకుంటున్న ఆశయాలను,

(తరువాయి 13 వ పేజీలో)

# వసుచరిత్ర - తెలుగుపదముల శ్లేష

– శ్రీ పొనుగోటి అర్జునరావు.

సాధారణముగా ప్రబంధములలో మేటిదైన వసుచరిత్రయందు రామరాజ భూషణుడు సంస్కృత పదశ్లేష నెక్కువగా సాధించినాడనియు, పిల్ల వసుచరిత్రగా పేరు పొందిన విజయ విలాసము నందు చేమకూర వేంకటకవి తెలుగు పద శ్లేష నెక్కువ గావించినాడనియు విమర్శకుల అభిప్రాయము. కాని మనము సూక్ష్మదృష్టితో పరిశీలించినచో వసుచరిత్ర యందు కూడ తెలుగు పదముల విరుపులు గోచరించును. అట్టి తెలుగు పదములను రామ రాజ భూషణుడు సమయసందర్భోచితముగా విశ్లేషించినాడనుటలో సంశయింప నక్కరలేదు. లాక్షణికులైన పండితుల యభిప్రాయములో అర్థాలంకార ప్రధానమైన కవిత్వము కేవల చిత్రకవిత్వముగా భావింపబడినది. కాని రామరాజ భూషణుడు తన ప్రబంధమును అలంకార ప్రధానముగా రచించినను రసోచిత ప్రబంధమును తీర్చిదిద్ది కావ్య నాయకుని ఉత్కర్షను సూచించినాడు. ఇందు సంస్కృత పద శ్లేష లెక్కువగా నున్నప్పటికి అందులో అక్కడక్కడవాడిన తెలుగుపద శ్లేషలు ప్రబంధమునకు ఒక విధమగు ప్రత్యేకతను సంతరింతజేయుచున్నవి. అందులో నాదృష్టికి గోచరించిన వాటిని ఇక్కడ విశదీకరించుచున్నాను.

రామరాజ భూషణుడు తనకృతిని తిరుమల రాయలకు అంకితము చేసినాడు. కావునపీఠికలో అతనిని వర్ణించుచు జనక నేత్ర ఫలంబయిన పాలపాపడు ...అను పద్యమున చంద్రునితో సమన్వయము చెప్పుచు రాజు పరమైన అర్థములో పాలు ద్రావు, చిన్న పిల్లవాడనియు, చంద్రుని అర్థములో 'పాల' అనగాపాల సముద్రముయొక్క 'పాపడు' అనగా కుమారుడు అనియు అర్థాంతరము చెప్పినాడు. చంద్రుడు క్షీరసాగరములో పుట్టినాడుకాబట్టి అతడు 'పాలపాపడని అతడెంత మృదువుగా నున్నాడో కవి అంత మధురముగా చెప్పినాడు. తిరుమల రాయని భార్య తిమ్మమాంబికను పొగడుచు ఆమె భూదేవి, లక్ష్మీదేవి, పార్వతీదేవి, సరస్వతీ దేవియు తమ తమ భర్తకు సేవలు చక్కగా చేయలేదని తన భర్తకు ఆమె నిత్యము సేవలు చేయుటకు పూనుకొనెనని చెప్పుచు–

'ధరయేయపాంసుల తల ...
తన కూర్మిఁజేని నప్పునఁ ముంచెఁ'॥

భూదేవి తన ప్రాణేశ్వరుని అందరిలో తల యెత్తుకొని తిరుగకుండ అప్పులలో ముంచెనని అర్థము, తనను ధరించిన కూర్మ రాజును (నారాయణావతారములలో నొకటి) అతని తల కన్పించకుండ నీటిలో ముంచె నని అర్థాంతరము. ఇక్కడ భగవంతుడు కూర్మావతారములో భూమి నుద్ధరించినాడు కాబట్టి భూమి యంతయు జలమయము. అందుకుగాను అతని తల కన్పించుట లేదని భావము అట్లే లక్ష్మీదేవి విష్ణువు ఎదపైని బరువగునట్లు కూర్చుని అతని 'పేగడుగు' పరచినదట. అనగా ఇట విష్ణువు పేరు కంటె లక్ష్మీదేవి పేరు ముందుండునని ఒకర్థము. (లక్ష్మీనారాయణులు) లక్ష్మీదేవి ఎదపై నుండును గనుక విష్ణువు మెడలోని 'పేరు' అనగా అతని దండను తన క్రిందుగా నుండునట్లు చేసె, నని అర్థాంతరము.

పార్వతి గిరిరాజ తనయ అనగా కఠినురాలు. పర్వతము కఠినము కదా! తండ్రి వలెనే కఠిన స్వభావము గలదై శివునితో 'జగడాలు' ఆడి ఆయనను చింతవంగోను జేసి సగము చేసినదట. అనగా జగడము లాడి భర్తను సాధించిన దని ఒకర్థము 'జగ' ప్రకాశమాన మైన, 'డాలు' కాంతి గలది' యై శివుని తేజస్సుకు సరితేజస్సు గలదై అర్ధనారీశ్వరత్వము పొందె నని రెండవ యర్థము. సరస్వతీదేవి తన భర్తయైన బ్రహ్మను 'మాట మోచెనన జేసె' నట. అనగా సరస్వతి బ్రహ్మముఖమునందే యుండును. అనగా వాణి(వాక్కు) ఇది నోటితో పలుక బడునది. వాకిటనె నిలుచుననగా మాటాడినవ్వుడు బయటకు వెలువడును. ఎప్పుడు నోటితో పలుక బడునది గాన తన భార్య ఎల్లప్పుడు బయటి వాకిటనే యుండి వచ్చేపోయే వారితో తగవులాడి తన భర్తను నింద పాలగునట్లుగా జేసెననియు, అర్థాంతరమున బ్రహ్మ నోటి యందు వెలువడునది వాణియే కాబట్టి ఎల్లప్పుడు తన నెడబాయక తననే మోయుచున్న వానినిగా జేసెననియు భావము.

హరి శౌర్యండగు ...

... ముసలి మానుల్గా వితర్కింపఁగన్'

ఇచట రామరాయల సేనా వాహిని ధాటి కోర్వలేక యవనులు నిశ్చేష్టులై 'ముసలి మానులుగా' నిలచినారట. ఉపమానములో శర వేగముతో చొచ్చుకు పోవుచున్న ఏటిలో నున్న చెట్లు వాటి యొక్క వేళ్ళు పెకలింపబడి ఆకులురాలి ముసలి మానులుగా[అనగా వయసుడిగిన చెట్లుఅనుట] నుండెనట. ముసలిమానులు అని తురకలను చెప్పుట 'అర్థాంత'ము. ఇందులో అచేతనమున ముసలి మానులు అనరాదని అభిప్రాయ భేద మొకటి గలదు. కాని 'మాను' అని చాలవరకు గ్రామములలోవాడుకలో గలదు.

'కావుకావను వారిఁగదిసి'

ఇందు తిరుమల రాయలయొక్క కత్తిని తన పుత్రిక పరముగాను, ఖడ్గ పరముగాను చెప్పినాడు. 'కావుకావుమని' యుద్ధములో శరణు జొచ్చిన శత్రు వీరులను చంపి ఊర్ధ్వలోక గతులను జేయరా దని యొక భావము. 'కావు కావుమని' చిన్న పిల్లలు ఏడ్చినపుడు ఆతని అసిపుత్రి తన రొమ్ముపై వారి మోమును చేర్చరా దని అర్థాంతరము. పిల్లలు ఏడ్చునపుడు తల్లులు పాలు కుడుపుట సహజము. అద్దస్థాన పురమును వర్ణించుచు -

వరసుమనో భవ్య తరుల కావాల ...

సరిలేని 'తెలిముత్తె పరుల' కొటారు ...

ఆ ఊరి యందు 'తెలిముత్తె సరివడ్లు' (వడ్లలో ఒకరకము) గల ధాన్యాగారములున్నవనియు, పరిశుద్ధమైన ముత్తెపు హారములు గల స్థలమైనదనియు ఆ యూరి ధనధాన్య సంపదలను చెప్పుచున్నాడు.

'పగలైనఁ డెల్విఁ గోల్పడని రాజును శరంబులు చన్న 'వెలవెలఁబోని' ఘనులు...

... ... ...

ఇందుఆరాజ్యపురాజులనుగూర్చి, రాజపరముగాచంద్రునిపరముగా రెండర్థములుగా చెప్పినాడు.' పగలైన' అనగా శత్రువులు ఎదురువచ్చినాకూడ తెలివితప్పనిరాజులు శరంబులు అనగా బాణములు లేకున్నను 'వెలవెల' అనగా బేలతనము వహించని గొప్ప వీరు లని రాజులపరముగాను చెప్ప బడినది. 'పగలైన' అనగా పగటి పూట అనిఅర్థము. పగలు చంద్రుడు తనకాంతిని కోల్పోతాడని భావము. శరములు అనగా నీరు లేకున్నచో 'వెలవెల' అనగా మేఘములుపాలిపోవునని(తెల్లబడునని)అర్థాంతరము.

ఘనుల 'కొండలపాలు' చేసినకొంత...

ఇందు ఘనులనగా గొప్పవారిని 'కొండలపాలుచేయుట' అనగా కించపరుచుట అనియు, పారద్రోలుట, అనియుఒకర్థము. ఘను లనగా మేఘములను 'కొండలపాలు' అనగా పర్వతములవైపు వాటిపైగా విస్తరింప జేయుట యని అర్థాంతరము.

'కొమ్మవా తెఱతో,' గుణమ్ముఁగైకొన

వచ్చి కఠిన విద్రుమము 'చేకట్లఁ'బడిరో'

ఇందు గిరికాదేవిని వర్ణించుచు ఆమె పెదవిని చూచి పగడము దానికి సమానముగా తులదూగుద మని వచ్చి ఆమె చేతితో ఆ పెదవివద్దకు పోకుండ పట్టి వేయ బడిన దని ఒకర్థము. గుణ మనగా దారము అని మరియొకర్థము గాన ఆ దారమునకు గ్రుచ్చబడుచు చేతి కంకణముల యందు ఉండి పోయినదని మరియొకర్థము,

పుడమి నచలేంద్రు, లెచ్చట ... ...

... మారసము లెచ్చట 'కెక్క'

మహాత్మ్య'

ఇందు శుక్తిమతి తనపై బడివచ్చు కోలాహలునిఁజూచి వినయముగాతప్పించుకొన జూచుచు అతనిని పొగడుచున్న సన్నివేశము. ఇచ్చట శుక్తిమతి నది గనుక జలము భూమిమీద పారుచుండును. కోలాహలుడు పర్వతము గనుక క్రింది నుండిపైకి నీరు పార దని ఒకర్థము. శుక్తిమతి ఒక స్త్రీగా వర్ణింపబడినది గావున

కోలాహలుడు చాల ఎత్తైన వాడనియు. ఉన్నత గోత్ర సంభవుడనియు నతను నీచ జాతి సంభవ గనుక తన అనురాగము అతనికి కూడ దనియు రెండవ యర్థము.

'అఖిల భువన ... ...
... ... ...
కొన్న 'యలఁజడి' యుడుగ ...
యేటికొయ్యన గర్భంబుఁ దేట పడియె'

ఈ పద్యములో శుక్తిమతి కోలాహలుడు–వీరిద్దరి సంయోగముచే శుక్తిమతి గర్భము తేట పడుటను ఒక స్త్రీపరముగాను, శరత్కాలములోని నదీ పరముగాను కవి వర్ణించినాడు. ఇక్కడ కోలాహలుడు శుక్తిమతితో బలత్కారముగా సంభోగ శృంగారము ననుభవించినాడు. ఆమె కడ్డముగా ఒరుగగా ఆమెలో భయాందోళనా యుక్తమైన 'అలజడి' ప్రారంభమైనది. అయినను ఆ గట్టుదొర పట్టిపట్టిన పట్టువిడువక ఆమె ననుభవించినాడు. ఆవిధముగా ఆభాస శృంగారము పాలైన శుక్తిమతి అను కన్నెకు మెల్ల మెల్లగా గర్భము తేట పడిన దని స్త్రీ పరమైన అర్థము. నదీ పరముగా చూచి నచో శరత్కాలమును వర్ణించినాడు. కాబట్టి శరత్కాలములో ఎడతెరిపి లేకుండగా కురిసినవాన 'అల = ఆవిధముగా, జడి = జడివాన' ఉడుగగా ఈశుక్తిమతీ నదీగర్భము(నడిమి)భాగము తేటదనము నొందె నని (బయలుపడిన దని) అర్థాంతరము.

(సశేషము)

# నాచన సోముని కథాసంవిధానము, సాహిత్య రసపోషణము

– 'భారతీయప్రి' శ్రీ నీలకంఠంగౌడు.

'నన్నయగారి త్రోవగొని
నవ్యగుణంబులు కొన్ని చేర్చి తి
క్కన మహాకవి ప్రవరుఁ
డాంధ్ర కవిత్వము వృద్ధి చేసె నె
ఱ్ఱన్నయు వీరిత్రోవఁ గొని
యర్వాత యింకొక కొంత యిచ్చె స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మ
హోదధినాఁ జను నాంధ్రభాషకున్'

అని వేంకట పార్వతీశ్వర కవులు పేర్కొనుటను బట్టి సోముని కవితా సంపత్తిచే నాతడు కవిత్రయము తరువాత అంతటి మహాకవిగా పేర్కొన బడెను. సంస్కృత హరి వంశమును ఉత్తర హరి వంశ మను పేర తెలుగులో చక్కని ప్రబంధముగా తీర్చి దిద్దెను. ఇందులో ఆరాశ్వాసములు గలవు. ఆరాశ్వాసములలో ఆరు కథలు చెప్పబడినవి. ప్రస్తుతము హంసడిభకోపాఖ్యానము నందలి కథా సంవిధానమును పరిశీలింతము.

కథా సంవిధానము :–

సంవిధాన మనగా చక్కని కూర్పు. కథలోని పాత్రల స్వరూప స్వభావములను సన్నివేశమునకు తగినట్లు వర్ణించుచు, సంభాషణముల చేత కథ నడిపించుట. ఇట్టి కథా కథన శిల్పమున సోముఁడు చక్రవర్తి వంటివాడు.

హంసడిభకులు లోనుగా నఖిలధరణిఁ
బెరుఁగ కంటక కోటిచేఁ బేదలైన
నరపతుల కీర్తి పటములు సిరుగకుండ
వెరవుతో నుద్ధరించిన వేల్పుశౌరి (4–2)

ఇది హంసడిభకోపాఖ్యానము నందలి మొదటి పద్యము. ఇందులో శ్రీకృష్ణుని అవతార లక్షణము సూచింపబడినది.

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే'

అను భగద్గీతా శ్లోకమునకు పై పద్యమునందలి భావము చక్కగా సరిపోవుచున్నది. హంసడిభకులు లోకకంటకులు. వారిని శిక్షించి ప్రజలను రక్షించుట భగవంతుని కర్తవ్యము. వారినెదిరించి యుద్ధమునందు ఓడింపలేదు. శివుని వరములు వృథా చేయలేదు. వారి వరములు వారికున్నవి. వారి చావును వారే తెచ్చుకొనిరి. అది యెట్లు సాధ్యమా? ఇదియే శ్రీకృష్ణుడు చూపిన నేర్పరితనము. దీనినే భగవద్గీతలో 'కర్మకౌశలమని' భగవానుడు పేర్కొనుట సువిదితమే కదా!

హంస డిభకుల ముఖ్యలక్షణము అన్నదమ్ముల ఐకమత్యము. వారిరువురు ఐకమత్యముతో అమరాసురాది సైన్యాధిపతులకు ఓడకుండగ శివుని యొద్ద వరములు శరములు పొందిరి. కయ్యమునందు కాపుదలగా భృంగిరిటి, కుండోదరుడు అను ఇద్దఱు ప్రమథులనుకూడ పొందిరి. ఇట్లు వర ప్రసాదము చేత వీరాభిమాన విజృంభితులై వేటకు పోయిరి. కాని వారికి వేటప్రధానము కాదు. మహర్షులను అవమానించుటయే లక్ష్యము. అందువలన కశ్యపాది మహర్షుల యజ్ఞ సమీప భూమికి పోయి

మాతంగ్రి రాజ సూయమునఁ
బ్రీతిం జేయంగఁ దలఁచి పిలువం బనిచెన్
భూతలమునఁ గల నృపతి
వ్రాతంబుల మీరు నరుగ వలయు
నచటికిన్. (4–38)

**అని** ఆడంబరముగా, ఆజ్ఞగా అసత్యే **మాడిరి. అప్పుడు** కూడ **వారి**కి మహర్షులు **యజ్ఞమునకు** రావలెనను సంకల్పములేదు. కనుకనే దుర్వాసుని చూచి ఆ బోడ తల సన్యాసము విడిచి పెట్టి బ్రతుక దలచినచో గృహస్థుడవుకమ్మని తమఆజ్ఞగా హెచ్చరించిరి. అపుడు వారి ఆప్తమిత్రుడైన జనార్దనుడు చెప్పిన మాటలు పెడ చెవిని బెట్టి ఆమహాముని గోచి లాగి అవమాన పరచిరి. అతడు వచ్చి కృష్ణునితో సర్వము విన్నవించెను ఇంతలో హంస డిభకులు తమనగరమునకు పోయి తండ్రిని రాజసూయము చేయుమని బలిమాలిరి. జనార్దనుడు కలదని చెప్పిను వినక అతనిని శ్రీకృష్ణుని యొద్దకు తమకు కప్పముగా ఉప్పు తేవలెననియు, యజ్ఞవేళకు మూందే రావలె ననియు రాయబారము పంపిరి. ఈ విధముగా వారిని చంపుటకు వారే దారిచూపించిరని సాత్యకిని పంపి కృష్ణుడు యుద్ధము ప్రకటించెను. పుష్కర సరోవర తీరమున జరిగిన యుద్ధములో కృష్ణుడు హంసుని కాళింది మడుగులో కానరాకుండ త్రొక్కివేసెను. అతనిపై గల మమకారముతో డిభకుడు కూడ ఏడ్చియేడ్చి తల రాళ్ళకు కొట్టుకొని చచ్చెను. ఈ విధముగా ఆ అన్నదమ్ముల ఐకమత్యమే ఆయుధముగా శ్రీకృష్ణుడు హంస డిభకులను సంహరించెను.

ఇందు వారి అహంకారము, అనివేకము దుర్వాసుని కోపనిగ్రహము, జనార్దనుని భక్తితత్పరత్వము, శ్రీకృష్ణుని దుష్టశిక్షణ, శిష్టరక్షణ కళాపారీణత్వము చక్కగా నిరూపింప బడినవి.

**సాహిత్య రసపోషణ :-**

సాహిత్య రసపోషణ మనగా సాహిత్యము నందు రసమును పోషించుట. అనగా కథ చెప్పు నప్పుడు పాత్రల స్వరూపమును వర్ణించి వారి సంభాషణల చేత చేష్టలచేత, స్వభావము నిరూపించుట. హంస డిభకోపాఖ్యానము హాస్య రస ప్రధానమైన ఘట్టము. ఇందలి వీరము ఆభాసమాత్రము. దుర్వాసుని స్వరూపము హంస డిభకులకు హాస్య పాత్రముగా తోచిన రీతి సోముడు ఇట్లు వర్ణించెను.

'కావి చీరముసుగు కచ్చడంబునుజూచి
బోడతలయు నిడుద బొట్టుఁ జూచి
గోఁచితోడి పెదురుఁ గోలయుఁ
జిక్కంబుఁ
గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి (5.42)

అట్లే హంస డిభకుల సంభాషణము హాస్య మయముగా ఉండును.

మిడికెదు పెదవులుఁ బ్రేవులు
మడిచెదు కనుదోయి వెంగిడి మారాయెదురఁ
గడన్
వెడ వీఁక యొడలు చేసెదు
కడపల జపమునకు నేఁడు గలదోలేదో. (4.44)

దుర్వాసుని కోపమున రౌద్రరసము ప్రస్ఫుట మగుచున్నది.

'ఈకమండలు పంక్తి నెటు చూతునిట్లు త
త్పాపమ స్తంబులు వగులకున్న
(4.102)

(తరువాయి 13వ పేజీలో)

---

( 10 వ పేజీ తరువాయి )

మార్పులను దిగంబర కవిత్వంలో వ్యక్తం చేసారు.

వీరు 'ఆదినుండి అనువాదానికి, అనుకరణకీ అలవాటు పడి నేడు పాశ్చాత్య స్వరాలకు ప్రతినిధిగా మారిన తెలుగు సాహిత్యానికి మౌలికమైన ధ్వనిని కోరుతున్నాం.

ఈ జీవితం తాటస్థ్యాన్ని వరించ కూడదు. మనిషి జీవితం దీపం లాగా కాకుండా తోటి వారి ప్రేరణ స్రోతస్సుగా ఉండడం కావాలి.

అభ్యుభ్యున్నతిలో మానవుడు ధరాతలంలో తప్పిపోకూడదు. తప్పిపోయిన ఆత్మను పట్టియిచ్చి మనిషిని మనిషిగా చూడాలనే మా కోరిక.

వ్యక్తిని శాసిస్తున్న రాజకీయాల మంత్రదండం విరిగిపోయి అసలు విలువల కోసం నిలిచే బ్రతికే జీవితం కోసం, సంఘర్షణ జరగాలి. అని తమ ఆశయాన్ని వ్యక్తంచేసారు. దేశాన్ని కష్టలాగా పట్టుకుంటున్న సినిమా వెర్రి ప్రభావం తగ్గి ఆరోగ్య కరమైన విజ్ఞాన వినోదసాధనంగా కళాకారుడి నిజమైన స్వప్నావిష్కరణగా సినిమా కావాలి. 'అని' ఏకాకి తనమే అస్తిత్వం కాదు. పరిసరాలు మానవబాంధవ్యాలు వదిలి క్షణంపై క్షణం బరువుగా పడి యీడుస్తూ పోవడం గాకుండా చైతన్యవంతమైన ఆత్మ సంతృప్తితో సాగే జీవితం నిజమైన అస్తిత్వం అన్నది వారి తాత్విక దృక్కోణం.

ఆశయాలు ఎన్ని ఉన్నా ఎంత నూతనత్వాన్ని కోరుకుంటున్నా శ్రీచల. అన్నట్టు సంఘం ఎనుబోతు లాంటిది. సంఘంలో మార్పురావాలి అంటే చాలా కాలం పడుతుంది. ఏ హఠాత్పరిణామాన్నీ. సంఘం గర్హించదు, సమాజం ఒప్పుకోదు. వీరి ఆశయాలు, ఆచరణలోకిరాక ముందే యీ దిగంబర కవిత్వం ప్రాచుర్యాన్ని కోలుపోయింది. దీనికి కన్పిస్తున్న కారణం వారి తీవ్రభావ అశ్లీలదూషణలే అని చాలమంది అభిప్రాయం. హితము కాంతాసమ్మితంగాఉండాలి. కాని వీళ్ళ కవిత్వంలో అది శ్రుతి మించింది. ఒక్క మాటలో చెప్పాలంటే శత్రుసమ్మితంగా ఉందిఅనవచ్చు. వీరు అల్పకాలం ఎంత పాటు పడ్డా నేటి వ్యవస్థాకశ్మలాన్ని ప్రక్షాళన చేయ లేక పోయారు. పైగా వీరికవితమనుగడ గాలిలో దీపంలా మారింది.

**

జనార్దనుని రాయబారమున శ్రీకృష్ణుని వర్ణనలో భక్తి రసము పోషింప బడినది.

'వెలిదమ్ములలో లేత వెన్నెలలో
యమృతమో
కన్నులలోచియునవ్వో కనికరంబో
(4-138)

కృష్ణుని పాంచజన్యరవము వర్ణించుటలో భయానక రసము మిన్ను ముట్టినది.

'వడఁకు పన్నగ రాజు పడగలమీఁద స
ర్వంసహాకాంత పేరణము సూప.
(4-216)

హంసడిభకులకు కృష్ణబలరాములతో జరగిన యుద్ధమున రౌద్ర, వీర, భీభత్సాద్భుత రసములు సంపూర్ణముగా పోషింప బడినవి.

ఉదా :- వ॥ 'ఇట్లు తలపడి సాయక నికరంబులఁ గరంబుల మునికట్లు పట్లుకఁ దునిమిన మానుకొని కరవాలంబులు వదనంబుల గఱచికొని కదనంబునకుం బఱచు వారు'
(4-129)

హంసుని కొఱకై డిభకుడు విలపించి, ప్రలాపించి ప్రాణములు విడుచు ఘట్టమున కరుణ రసము నిర్భరముగా పోషింప బడినది.

'నాయెల్లి నీడన నగిలోక మేలుదు
ననులావు వఱితిపా లయ్యె నన్న'
(4 300)

'ప్రేలెడు వెండుక లిరుగడఁ
దూలఁగఁ దలయూఁచుచుఁ దొప్పఁ
దొప్పన నోరుం
గేల నడచికొను సెలవుల
లాలలు దొరుఁగంగ నన్నలా! యని
యొఱలున్
(4 302)

ఈ విధముగా కథ చెప్పుకొని పోవుట కాక సన్నివేశమును రసప్రధానముగా సంవిధాన పరచుటయే సోముని సాహిత్య రసపోషణము.

—...—

# స్త్రీల పాటలయందు అత్తాకోడళ్లు

- శ్రీమతి శిష్టా లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.

గృహజీవనమునకు స్త్రీ మూలవిరాట్టు తల్లిగా, కూతురుగా, అత్తగా, కోడలుగా, వదినగా, ఆడుబిడ్డగా వివిధదశల యందుండు స్త్రీల నేర్పు వర్ణనాతీతము. ఆయా దశలతో స్త్రీ, తన బాధ్యతలను సక్రమముగా నిర్వహించును. గృహజీవనమునందువలెనే గృహజీవనసారస్వతమునందును గృహిణికే ప్రాముఖ్యమును ప్రాతినిధ్యమును కల్పింపబడినవి.

గృహమునకు యజమాని పురుషుడే అయినను గార్హస్థ్యజీవితము నందు మాత్రము స్త్రీలదే పైచేయి అయినది. ప్రాచీనకాలమున మనదేశము నందు మాతృస్వామిక వ్యవస్థ నెలకొనియున్నదని సామాజికశాస్త్రమునుబట్టి తెలియుచున్నది. దీనియందు గృహయజమానురాలుగా స్త్రీలకే అధికప్రాధాన్యముండెను. ఈ వ్యవస్థ యందు పురుషుడు నామమాత్రావశిష్టుడు. కుటుంబపెద్దగా నేడు పురుషుడు ప్రవర్తించువిధముననాడు సంఘమున స్త్రీలు ప్రవర్తించెడివారు. ఆస్తిపాస్తులన్నియు తల్లి యనంతరము కుమార్తెలకే సంక్రమించెడివి. కాలక్రమమున ఈపద్ధతి మార్పుచెంది పితృస్వామికవ్యవస్థ ఏర్పడినది. అయినప్పటికిని మాతృస్వామికవ్యవస్థ యందలి కొన్ని లక్షణములు మాత్రము నేటికిని నిలిచియున్నవి. వీనిలో ముఖ్యముగా పేర్కొనదగినది 'అత్తవారిల్లు' అను వ్యవహారము.

స్త్రీజీవితమునందుఅత్యంత ప్రాముఖ్యమును సంతరించుకొనిన ఘట్టములలో మొట్టమొదటిది వివాహము. భర్తృగృహమున అత్త ఆడుబిడ్డల నడుమ కాపురము జేయు నామెకు వారినుండి ఆదరాభిమానములు లభించినచో ఆ స్త్రీజీవితము ధన్యమే యగును. లేనిచో సమస్యలమయ మగును. సాధారణముగ నిరువురు కలసిమెలసి యుండుట అసంభవము. కావుననే 'రెండుకొప్పులు ఒకచో నిముడవు' అను సామెత ప్రచారములోనికి వచ్చినది. అందునను అత్త, ఆడుబిడ్డ, కోడలు, వీరు ముగ్వురును ఒకచో నుండుట కష్టము. వ్యక్తి వ్యక్తికిని అభిప్రాయములందు విభిన్నత్వము గోచరించుచుండును. 'లోకో భిన్నరుచిః' అని పెద్దల నానుడి. సాధారణముగ ఇరువురు వ్యక్తుల మధ్యనే యిటులుండిన 'అత్తాకోడళ్ళ' నడుమ అభిప్రాయభేదము లేర్పడుట అత్యంత సహజము.

కొడుకు పెండ్లి యగుటతోడనే అంతవరకు కోడలుగా నున్న స్త్రీ అత్తగా మారి తనకెంతయో అధికారము వచ్చినటుల ప్రవర్తించుచు కోడలిపై పెత్తనము 'చలాయించు'ట ప్రారంభించును. అత్తగారి పెత్తనమును సహింపని కోడలు చాటుమాటుగా అత్తగారిని నిందించుచుండును.

ఈవిధముగ అత్తకోడళ్ళ నడుమగల సంబంధము పులి మేక సంబంధము వంటిది.

'ఏసంఘము నందైనను ఎంత అనాగరక జాతి యందైనను అత్తాకోడళ్ళు కనిపిస్తారు. ప్రపంచసాహిత్యము నందు గృహస్థజీవితమునకు సంబంధించిన ఘట్టములలో అత్తాకోడళ్ళ పాత్రలు మనకు గోచరిస్తున్నాయి. పాశ్చాత్య దేశాలలో కుటుంబం అవిభక్తం కాదు కాబట్టి మన కుటుంబంలో కన్పించే అత్తాకోడళ్ళవంటి వ్యక్తులు కనిపించరు. కోడండ్రికం అనే వింతప్రవర్తన గోచరింపదు. హిందూ గృహంలో కన్పిచే అత్తగారి వంటి అత్తగారు కన్పించరు. అయినను వారిలో గూడ అత్తగార్లను ఆక్షేపించడం ఉందని వారి గ్రంథాలద్వారా, సినిమాల ద్వారా తెలుస్తుంటుంది. ఆ గృహంలోని అత్తాకోడళ్ళు సామరస్యంతో సుహృద్భావంతో స్నేహంతో మసలుతారు' 1 అని శ్రీమతి యం. సుశీలగారు అత్త ఒకింటికోడలే అను రేడియో ప్రసంగము నందు పేర్కొనినారు.

హిందూసంఘము నందలి అత్తాకోడళ్ల అనుబంధము సంప్రదాయ సిద్ధమైనది. అనాదినుండి అత్తాకోడళ్ళ సంబంధము మన సారస్వతము నందు సామెతల రూపమున చోటుచేసికొనినది. అత్త కోడలు అను రెండు పదములు విడదీయరాని జంటగా కాన్పించుచుండును. అత్తాకోడళ్ళ నడుమ పొత్తు లేకపోయినను ఈరెండు పదములును ఒకదానిని మరియొకటి అనుసరించియే యుండును.

పెండ్లిలో అప్పగింతల సమయమున తల్లిదండ్రులు తమ కుమార్తె బాధ్యతను అందరికిని అప్పగించినను అత్తగారికే అధికముగ అప్పగించుట కాన్పించును. దీనికి కారణము గృహజీవనమున స్త్రీలకు ప్రాధాన్య ముండుటయే. గృహజీవనమునకు సంబంధించిన వివిధ కార్యకలాపముల యందు స్త్రీలందరును కలిసికట్టుగా పనిచేయవలసియుండును. అట్టిచో క్రొత్త కోడండ్రకు పనులు నేర్పింపవలసిన బాధ్యత కూడ అత్తలకే యుండును. పనులు నేర్చిన కోడలేయైనను ఇంటింటికిని పనులయందు భిన్నత్వము గోచరించుటచే తమ యింటి వ్యవహారములను తెలియఁజేయు బాధ్యత అత్తగారిదే. ఈ కర్తవ్యనిర్వహణమును సక్రమముగా నెరవేర్చుటకై అత్తగారు, కోడలు కలసిమెలసి యుండవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. లేనిచో వారి నడుమ కలతలు ప్రారంభమగును. ఈవిషయమును గుర్తించియే తల్లి తమ కుమార్తెను అత్తగారికి అప్పగించును. కుమార్తెకు అత్తవారింట ఆమె ప్రవర్తింపవలసిన తీరుతెన్నులను గూర్చి బోధించును.

అత్తాకోడళ్ళ నడుమగల సంఘర్షణము లున్నవి. అత్తగారు తన ఆధిక్యమును నిలుపుకొనవలయు నని ఎల్లవేళల ప్రయత్నించును. ఆ ప్రయత్నములో కొన్ని కొన్ని సమయములందు కోడలు చిన్నబుచ్చుకొనుటయు సంభవించును. కన్నతల్లిదండ్రులను, పుట్టిన ఊరును, ప్రేమాభిమానములతో గారవించు అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను వదలి నూతనవ్యక్తితో జీవితమును గడపుటకు అత్తవారింటికి వచ్చిన కోడలు అచట ఆదరాభిమానముల నాశించుట సహజము. అత్తింట తనకు గౌరవము నేగాని, చిన్నబుచ్చుట నామె సహింపదు. ఈ విధముగ అత్తాకోడళ్ళ నడుమ అభిప్రాయ భేదము లేర్పడుచున్నవి. అదియునుగాక తల్లి తన కుమార్తె చేసిన పనుల నన్నిటిని సమర్థింపక పోయినను కోపగింపక ఉదాసీనతను వహించును. అదేవిధముగ కోడలు ప్రవర్తించినచో నామె కోపగించి కోడలిని చిన్నబుచ్చుటకు యత్నించును. తాను చేసిన పని నచ్చనపుడు తల్లి ఏ విధముగ మందలించినను కుమార్తె మారుమాటాడక యూరకుండును. తల్లికి తనను దండించు అధికారము కల దని ఆమె భావించును. అదేవిధముగ అత్తగారు కోడలిని దండింప యత్నించినచో తానన్నచో అత్తగారికి ద్వేషము కావుననే తనను దండించుచున్న దని కోడలు తలంచును. అత్తగారిని తల్లిగను, కోడలిని కూతురుగను భావించినచో అత్తకోడళ్ళ నడుమ వాదోపవాదములే యుండవు. కాని ఈ విధముగు భావన లోపించుట చేతనే అత్తాకోడళ్ళ నడుమ కీచులాటలు సంభవించు చుండును.

అత్తాకోడళ్ళ నడుమ కీచలాటలు జరుగుచుండుట సామాన్య సంసారములలోని లక్షణము. ఇది శిష్టసాహిత్యము నందు కాన్పింపదు. ఏలన మన శిష్టసాహిత్యమంతయు రాజాంతఃపురములవరకే పరిమిత మయినది. అచట అత్త, కోడలు విడివిడిగ నుందురు. కావుననే వారిమధ్య మనఃస్పర్ధలున్నను బహిరంగముగ వాదోపవాదములు జరగవు. కాని సామాన్య సంసారముల యందు అత్తాకోడళ్ళు ఒకే యింటి యందు నివసించు చుండుటచే అభిప్రాయభేదము లేర్పడి క్రమక్రమముగా నవి వాగ్యుద్ధమునకు దారి తీయు చుండును.

కోడలుగా స్త్రీ జీవితము ప్రారంభదశ యందు చక్కగనే యుండును. అత్తగారు కోడలిచక్కదనమును, తెలివితేటలను ఇరుగుపొరుగు వారితో చెప్పి మురియుచుండును.

చూడవే సుబ్బమ్మ కోడ లొచ్చింది
అందాలు చిందేటి అతి చక్కనిది
చిలుకల్లు చిలుకల్లు అందు రేగాని

చిలుకలకు రూపేమి? పలుకు లేగాని
చిలుకల్లు మాయింటి చిన్న కోడళ్ళు
కోయిల్లు కోయిల్లు అందు రేకాని
కోయిల్లకు రూపేమి? ఘోష లేగాని
కోయిల్లు మాయింటి కొత్త కోడళ్ళు

అనుచు తన కోడండ్రను చిలుకతోను కోయిలతోను సరిపోల్చుచు ఆనందము అనుభవించును.

కొత్త కోడలిని అత్తగారు, మిగిలిన కుటుంబ సభ్యులు కూడ అతి గారవముగ చూచుచు మన్నించుట క్రింది పాట యందు కానవగును–

ఇల్లలికి ముగ్గుబెట్టి రింటిముగ వారు
పిడకళ్ళుదీసె పెదబావగారు
ఇంటిపనులు చేసె యింకో బావయ్య
అంటులన్ని యుదోమె అత్తయ్యగారు
ఇంటిపనులు నయ్యో విడిది లేవమ్మ

దీనియందు అతిశయోక్తియే అధికముగ గోచరించుచున్నది.

మాయింటి కోడలు మంచిముత్తేము
సీటిమాటికి తాను సీరాకుపడదు
పెందలాకడ లేచి పాసి చేసేసి
యిల్లలికి ముగ్గేటి యాదిలో తుడిసి
కల్లాపుజల్లేసి గొడ్ల మే తేసి
సీలాకు రేవుకు నెమ్మదిగ బోయి
నీళ్లు తెత్తాదమ్మ నిత్తెముత్తేదు
అత్తమామలకు ఎత్తల్లుచెద్దు
పెనిమిటిని సిరికంట పలకరిత్తాది
మరుదులను మంచిగా మందలిత్తాది
తోడికోడళ్ళనూ తోటోళ్ళవలెనూ
గౌరవిత్తాదమ్మ గౌరమ్మ తల్లీ

జానపద గేయాలు, సేకరణ : ఎల్లోరా

ఈపాట యందు అత్తగారు కోడలిని ప్రశంసించుచున్నది. నిజముగ అత్తగారి ప్రశంసల నందుకొనిన కోడలి జీవితము ధన్యమైనదే.

అత్తింటి కోడలు అలిగిపడుకుంది
అలుకల్లు తీర్చవే మూలకల్లకర్ర
అట్లుతిని అన్నయ్య అలిగిపడుకొంటే
తిట్లుతిని వదినమ్మ తీపులందింది

ఈపాట వదినామరదండ్ర పరిహాసముల కోవలోనికి చెందినదే అయినను దీనియందలి విషయము మాత్రము పరిహాసముగాక యథార్థమైనదే.

అత్తింటికోడలి జీవితము కత్తిమీదసాము వంటిదే. ప్రారంభదశలో అత్తగారు కోడలిని గౌరవించినను కొంత కాలమైన పిదప ఇరువురకును కీచులాటలు ప్రారంభమగును.

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
పచ్చిపాలా మీద మీగళ్ళు ఏవి?
వేడిపాలమీద వెన్నల్లు ఏవి?
నూనెముంతలమీద నురుగుల్లు ఏవి?

అని కోడలిని ప్రశ్నించును. అత్తగారు కోడలిని ఆరడిబెట్టుటకును, సాధించుటకు ఈవిధముగా ప్రశ్నించును. గాని నిజమునకు పచ్చిపాలమీద మీగడ కాని వేడిపాలమీద వెన్నగాని యుండుట, అసంభవము. ఈ విషయమునే ధ్రువపరచుటకై కోడలు యత్నించును. ఆ ప్రయత్నములో నామె అత్తగారిని ఆరళ్ళ అత్తగా అభివర్ణించును.

అత్తరో ఓఅత్త ఆరళ్ళ అత్త
పచ్చిపాలామీద మీగడుంటుందా
వేడిపాలామీద వెన్న ఉంటుందా
నూనె ముంతలమీద నురుగు లుంటాయా?

అని సమాధానమునిచ్చుటకు యత్నించును. ఈ ప్రయత్నములో నామె అత్త గయ్యాళితనమును ఇరుగుపొరుగు వారికి చూపుటకును, తన నిర్దోషిత్వమును నిరూపించుకొనుటకును యత్నించును.

'ఇరుగుపొరుగుల్లార ఓ చేడెలార
అత్తగారారళ్ళు చిత్తగించండి
పెత్తనా లాగేస్తే పేచీలుపోను'

అని అత్తగారిని ఎత్తిపొడుచును. కోడలు స్వతస్సిద్ధముగ మెత్తని దైనయెడల అత్త గయ్యాళితనమును సహించుచు లోలోపల దుఃఖించుచుండును. అత్త అను శక్తికి భగవంతుడులొంగిఉండుమన్నా డనునది స్త్రీనమ్మకము. అదియునుగాక అత్తగారు తన భర్తను పెంచి పెద్దచేసిన మాతృమూర్తి యనియు, అన్ని విషయముల కుందును, అనుభవజ్ఞులను మన్నింపవలయు ననియు కోడలు భావించినను; అత్తగారు కోడలిపై పెత్తనమును చెలాయింపక ఆమెను తన కుమార్తెగను, తమ వంశము నభివృద్ధిజేయు స్త్రీమూర్తిగనో భావించి నంతకాలమును అత్తకోడళ్ళనడుమ కీచులాటలు సంభవింపవు. కాని ఈభావన అత్తాకోడళ్ళ నడుమ ఎన్నడు వృద్ధినొందదు. కోడలు గృహప్రవేశము చేయగనే అత్తా తన యింటియందు తన అధికారము తగ్గిపోవు నని భయపడి, తన స్థానమును పటిష్ఠము చేసికొనుటకు యత్నించును. ఆ ప్రయత్నములో నామె కోడలిని చిన్నచూపు చూచుట కూడ సంభవించును. కోడలుగా అత్తగారింట అడుగుబెట్టిన స్త్రీ తన భర్తృగృహము నందలి బరువుబాధ్యతలను తానుగూడ భరింపవలయు నని నిశ్చయించుకొనును. ఈ కర్తనిర్వహణమునందే అత్తాకోడళ్ళ నడుమ వాదోపవాదములు జరిగి క్రమ క్రమముగా నవి తీవ్రరూపమును దాల్చును ఈపరిస్థితులను గమనించిన పెద్దలు, అనుభవజ్ఞులు

అత్తలేని కోడ లుత్తమురాలు
కోడలులేని అత్త గుణవంతురాలు

అను సామెతలు లోకము నందు పాదు గొల్పియుండవచ్చును. అత్తాకోడళ్ళ అనుబంధమును పరిశీలించినవారికి ఈ సామెత యథార్థమేయను అభిప్రాయము కలుగును.

(సశేషము)

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోస్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు


అడ్రసు :—

సంపాదకుడు, **బులుసు సీతారామశాస్త్రి,**

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజీ,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.